# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4    రాజమహేంద్రవరము 16-1-1981    సంచిక 6

— ఈ సంచికలో —

1) రాయప్రోలువారి సాహిత్యములో నవ్యత.

2) మనుచరిత్ర - పరిశీలనము-II

3) కవులు చిత్రించిన 'సత్యభామ'

4) ఉపనిషత్తులు - భక్తి.

5) అభ్యుదయ కవితావర్ణనం - దాశరథి 'పునర్నవం'

6) ఆధునిక నవలికకు శ్రీ కుటుంబరావు చేకూర్చిన సంపద.

7) వీరాభిమన్యుడు (ఏకపాత్రాభినయం)

8) గ్రంథసమాలోచన. శ్రీనాథుడు.

9) ఈపక్షంలో

10) శ్రీనాథుడు - శివాద్వైతము.

11) లేఖ - పత్రికలు - అనౌచిత్యాలు.

12) హిందూ రిపబ్లిక్కు (పద్య)

13) సంక్రాంతి (గేయ)

1—2—81 సంచికలో మౌసలపర్వ వైశిష్ట్యము, మందారమకరంద మాధుర్యము, జ్యోతిశ్శాస్త్రి సభావ్యాసముల సమీక్షా పరామర్శము, స్వామినేని ముద్దునరసింహానాయుడుగారు, జీవనయాత్ర నవల-ఒక పరిశీలన మొ॥ ఉంటాయి.

— 1, 16 తేదీలలో ప్రచురింపబడును —

చందా :
సంవత్సరమునకు రు. 12—00.
అర్ధసంవత్సరమునకు రు. 6—50.
విడిప్రతి 60 పై.

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము 4 రాజమహేంద్రవరము 16-1-1981 సంచిక 6

# రాయప్రోలువారి సాహిత్యములో నవ్యత

– శ్రీ పి. సత్యనారాయణ, ఎం. ఏ.

రాయప్రోలు సుబ్బారావు 20వ శతాబ్దము పూర్వార్థములో భావకవిత్వానికి పునాదులు వేసి, అందమైన కవితాసౌధాలను నిర్మించుకొని అందులో చిరస్థాయిగా నిలిచిన కవివరేణ్యుడు. నవ్యకవితారీతులలోని, అక్షరరమ్యతకు, ఆహ్లాదజనకతకు ఈకవి హృదయం నిలయం. అందుచేతనే భావకవిత్వ క్షేత్రములో రత్నాల్లాంటి కావ్యములను, కావ్యఖండికలను పండించి, అందించిన మేటికవి రాయప్రోలు సుబ్బారావు. శబ్దచిత్ర లౌల్యమునకు, నిర్వేలశృంగారమునకు, నీరస సంప్రదాయ పాలనమునకు విరుగుడుగా రసగుళికల వంటి నవ్య, రమ్య కావ్యములగు తృణకంకణం, స్నేహలత, స్వప్నకుమార మాదిగా గలవాటికి కర్తగా చిరకాలం నుండి సాహితీజగత్తుకు పరిచితులైనారు.

తరుణదశలో అనుకవితా ప్రవాహములో కొంతదూరం కొట్టుకొనిపోయినను త్వరలోనే తప్పు గమనించి, యేటికెదురీది ప్రవాహాంశనే క్రమక్రమంగా మచ్చవేసిన నవ్యకవిత్వ యుగకర్త సుబ్బారావు. పూర్వకాలమునుండి కావ్యములలో నాయికా నాయకులు రాజవంశీయులే యుండవలెనను నియమమును తిరస్కరించి సామాన్యమానవులను కావ్యపాత్రలుగా గైకొన్నాడు. ఇతని కవిత్వంలో ప్రకృతి వర్ణనలు అధికంగా ఉంటాయి. పూర్వకవుల కృతులలో గులాబి, సంపెంగ, చందన, తమాల, పనస ఖర్జూరాది వృక్షములే వర్ణితములైనవి. చిరునిమ్మ, అనాస, తులసి, తాటియాకులతో, తోటలతోనొప్పు తెలుగునాటి పల్లెవాసుల జీవితములను, వాతావరణములను, ప్రకృతిచిత్రణములను కావ్యప్రాంగణమున ప్రవేశపెట్టినాడు.

'వాణి వాయింప మ్రోగిన వీణమీద పారసీక గీతములను పల్కించినాడు.'

'కచకుచ వర్ణనలతో విసిగిపోయిన కావ్యకన్యకను సమాదరించి, ఆమె అంతరంగములోని అమృతమును వెలికి దీసిన కవి సుబ్బారావు. భోగవస్తువుగా, కేవల వర్ణ్యవస్తువుగా పరిగణించబడుచున్న 'స్త్రీ'ని దేవీ పీఠముపై అధిష్ఠింపజేసినాడు.' లఘు కథాకావ్య రచనకు దారులు తీసినాడు. లక్షణబద్ధమైన కవిత్వంతోపాటు దేశికవితకు దివ్వె లెత్తినాడు. దాదాపు అర్ధశతాబ్దముపాటు కథాకావ్యము, ఖండకవిత, గేయకవిత, ప్రేమగాథ, ప్రబోధకవిత, సంఘసంస్కరణ కవిత్వము, ప్రణయ, పల్లీయకవిత్వము, అభ్యుదయగీతములున్నగు బహు ప్రక్రియలలో ధారావాహికంగా కవితామధువు నందజేసినాడు.

ఈవిధంగా అనంత కవితా రీతులలో ప్రస్థానించిన రాయప్రోలువారి కవిత్వంలో నవ్యత, రమ్యత, కవితావ్యక్తిత్వ క్రమ విలాసములను, పరిశీలించి చూపుటకు యత్నింతును.

1912లో 'తృణకంకణ' రచనతో రాయప్రోలువారు నవ్య కవిత్వమునకు ప్రవక్తృస్థాన మధిష్ఠించినారు. వస్తువులో, భావములో, రచనలో నవ్యత సాధించిన కావ్య మిది. ఆంధ్రసారస్వతమున ఖండకావ్య మహోదయ స్థాపకులగు కవిభూషణ శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి రచనలలో తొలిసారిగా అవతరించిన కావ్యఖండిక 'తృణకంకణము', సుబ్బారావుగారు పాఠకులు పాయలుగా విడిపోయిన తెలుగుకన్నియ ముంగురులకు వేణీయోగ్యాభరణముగా జడకుచ్చులల్లినారు. ఆమె మణిబంధమందు తృణకంకణం భక్తితో నమర్చినారు. తృణకంకణనాయికా నాయకులు ప్రేమతపస్వులు; చిన్ననాటి నెచ్చెలులు. మన సంఘజీవితమున కనిపించు వ్యక్తులకు నిదర్శనములు. విద్యార్థులు కొందరు ప్రేమను శారీరక సౌఖ్య మని నిర్వచనం

చెప్పుచున్నారు. ఒకరినొకరు వీక్షించినంత మాత్రముననే హృదయములు ఉద్రిక్తము లగుచున్నవి. 'క్రొత్తదన మొకింత మాసినయంతనే వైవాహిక జీవితము దుర్భర' మగుచున్నది. వీరికి సుబ్బారావుగారు 'తృణకంకణము' న దివ్య సందేశ మొసగినారు.

ఒకచెంప ప్రశంసించుచునే రాయప్రోలు వారు కవిత్వము నీరీతిగా తూర్పారబట్టిరి.

'... ... ...
కర్పూరంపు బలుకుల్ దెనుంగు లిపి వే
గ ప్రక్రియా ధోరణిన్
విపరీతానిల ధాటిలో చెరిగిరన్
విధ్వంస మైపోదె త
ద్వీపు లానాయము, మెత్తురే రసికు లీ
విన్యాస వైకల్యమున్.'

కపురపు తునకల వంటి తెలుగు పలుకుల విపులామోదమును విధ్వంసము చేసెడి ఆశుకవిత్వ ప్రభంజనమును పైవిధముగా నిరసించి తన ఆశుకవితా సన్యాస మిప్పించి, రమ్యాక్షర శ్రేణి వైపు మరల్చుమని ఇష్టదేవత నీవిధముగా ప్రార్థించిరి

'తెనుగే తీయని, దందు పద్యపదరీ
తి క్రీడ లత్యంత మో
హనములే శోభనముల్ తదీయరసర
క్తాలాపనంబుల్ లభిం
చిన వాగర్థకలాకలాపజయ ల
క్ష్మీన్ గాలికిం బుత్తునే
జననీ! యేమిటి కింక ఆశుకవితా
సన్యాస మిప్పించవే.'
'రసమో భావమొ, జీవదర్థ సుకుమా
ర వ్యంజనా మంజు శ
బ్ద సమాసారచనంబొ, సాధు హృదయా
స్పంద ప్రతిష్ఠా కథా
విసరంబో, సకలార్థశూన్యమగు నీ
వేగాతి వేగోక్తి దు
ర్వ్యసనం బేటికి త్రిప్పుమింక జననీ!
రమ్యాక్షర శ్రేణికిన్.'

రసము, భావము, వ్యంజనా మంజు శబ్ద సమాస రచనము, సాధుహృదయస్పంది ప్రతిష్ఠా కథా విసరము, గల రమ్యాక్షర రచనా మార్గమున ప్రయాణించవలెనని రాయప్రోలు వారు దీక్ష గైకొనిరి. ఈ ఘట్టమున వారి జీవితములోని ప్రథమదశ పరిసమాప్తమైనది. వస్తుభావరచనలో నిస్తుల నవ్యతను కాంక్షించిన ద్వితీయదశ ప్రాప్తించినది. అప్పటినుండి అభినవ కవితకు, నవ్యకవితకు ఆచార్యులైనారు.

కవితా ప్రపంచమున ఆవేశమున కగ్రస్థాన మొసంగి, ఆనంద సౌందర్యములనారాధించి ప్రకృత్యుపాసకులై శృంగార రసమును వింతరీతుల ప్రదర్శించి, ప్రేమస్వరూపిణి యగు 'స్త్రీని' మాతృపీఠమునం దాసీనురాలిని గావించి, శబ్దార్థములందు సమానంగా తెనుగు పదములను, తెనుగుదనమును ప్రకటించి, రసోపాసకులై వర్ధిల్లుచున్న ఆచార్య సుబ్బారావుగారే యాంధ్రభావకవిలోకమునకు మార్గదర్శకులు.

రాయప్రోలువారిలో క్రొత్తదనమునకు పాదులువేసినవారిలో వారి 'పిన్నిగారు' ప్రథమస్మరణీయులు. సాహిత్యాభిరుచియున్న విదుషీమణి యామె. రాయప్రోలు వారి కామె జ్ఞానచక్షుస్సును ప్రసాదించినది. ఒకమారు ఆమె కోరికపై రాయప్రోలువారు 'అనసూయ చరిత్రము' చదివి ముగించిరి. అది విని పిన్ని యిట్లనెను.

'నాన్నా చూచావురా! త్రిమూర్తులంకూడా ఎలా తల్లికంటితో చూస్తే చంటిపిల్లలైనారో? ఈలాంటి భావము మన కథా (కలాపాల్లో) ఇంకా అధికంగా ఉంటే ప్రేమభాండము తొణికేదా? ఏ గ్రంథములోవిన్నా ఆడవాళ్ళను గూర్చి ఏమేమో వ్రాస్తారు మగవాళ్ళు.'

ఈ వాక్కులు రాయప్రోలువారి లేత గుండెపై చెరగని ముద్ర వేసినవి. ముక్తకంఠమైన వారి 'అనంతరాగ సంహితోత్కంఠ' కిదే అమృతబీజమైనది. అప్పటినుండి 'క్షీరసాగర శయన' – యనుగీతము విన్పడినప్పుడు ప్రేమస్వరూపిణియగు తల్లి, ఆమె వక్షఃస్థలముపై స్తన్యపానము చేయు శిశువు, వారి భావాంబర రూప దర్శన మిచ్చేవారని అభిప్రాయపడినారు. వారి కావ్యములలో 'స్త్రీ'కి దివ్యత్వ మబ్బుటకును, ప్రకృతిస్థానము లభించుటకును వారి 'పిన్నిగారి' – మాటలెంతో దోహదం చేసిన వని స్పష్టమైనది. రాయప్రోలువారి మనఃపరివర్తనమునకిది అంతరంగికమైన ప్రభావ మనుకోవచ్చును. కందుకూరి సంఘసంస్కరణోద్యమము, గిడుగువారి భాషాసంస్కార మహోద్యమము పండితులలో 'దడ' పుట్టించినవి. 1912 లో కన్యాశుల్క పునర్ముద్రణము వెలువడుటతో విమర్శకులలో, పండితులలో దానిలోని నాటకలక్షణములను గూర్చి, రసౌచిత్యములను, నాయికానాయకులను గూర్చి విమర్శలు దుమారమువలె చెలరేగినవి. శృంగార రసముపై సుదీర్ఘ చర్చలు సాగినవి. ఈ చర్చల మూలంగా 1) శృంగార శుచిత్వము, 2) విప్రలంభ ప్రాధాన్యము 3) దేశీయచ్ఛందః ప్రాశస్త్యమును ఈ మూడింటిని సుబ్బారావుగారు కాంక్షించుకొన్నారు. ఈ వాదోపవాదములు రాయప్రోలువారి ఆలోచనావృక్పథములో పరిణామశీలకమైన మార్పు తీసుకొని వచ్చినవి. అటు తంజావూరి శృంగారముతో అసహ్యపడి, ఇటు పూర్వశృంగార వ్యవస్థవచ్చక ఊగులాడుచున్న అంతరంగంలో 'పిన్నిగారి' మాటల మూలంగా రాయప్రోలువారికి క్రొత్తబాట స్ఫురించినది. వారు ప్రతిపాదించిన 'అమలిన శృంగార' సిద్ధాంతమునకు ఈ కాలమే ప్రాతిపదిక యనవచ్చును.

ఈవిధంగా రాయప్రోలు రచనలో, వ్యక్తిత్వములో, ఆలోచనలో ఒకవిధమైన నవ్యత చోటుచేసుకొన్నది. భావకవిత్వపుబాటలో పయనించాలనుకున్న దృక్పథాన్ని దృఢపరచుకొన్నాడు. 'స్త్రీ' ని ఆరాధ్యదైవంగా భావించి, ప్రకృతికి మారుపేరుగా రచనలలో 'అమలిన శృంగార తత్త్వ' సిద్ధాంతములను చొప్పించి కవిత్వంలో నవ్యత సాధించిన మహనీయుడు. క్రొత్తపాతల కూర్పికలయికయే ఈయన కావ్యములకు వన్నెపెట్టుచున్నది. రాయప్రోలు రచనలలో ఉత్సాహమెల్ల యెడల దీపించుచుండును.

ప్రబంధకవుల వలె భావకవులు కూడ తెనుగు సాహిత్యములో నొక ప్రత్యేకతను ఈ 20 వ శతాబ్దములో సంతరించుకున్నారు. దేశభక్తి ప్రబోధకము అగు పద్యములను వారు గానముచేసినారు. ప్రియురాలు వారి కారాధ్యదేవత. వారు స్వేచ్ఛాజీవులై సౌందర్యమును, ఆనందమును ఉపాసించెడివారు.

'సుకవి భోగ్యంబు లిచటి వస్తువులు వీని నలిపి వేయకు డిటు నటు కలచివైచి.'–

అని వారు హెచ్చరించినారు.

రాయప్రోలు వారినుండి భావకవుల ధనంగా, వర్ణ్య వస్తువులుగా మిగిలిన, ప్రకృతి, తుషారజలము, నీలంపుజలదంపు నిగ్గు, విరిసెడి చిన్నారిసిగ్గు, వసంతఋతు శోభ, కోయిలకూతలు, కమ్మతెమ్మెరలు, ఎలదేటి చిరుపాటలు, చిఱుజరీయంచు చీర, రుచికర సరోజములు, కాంచన హార విలసత్కంఠదేశము, జారుచెమ్మట ముత్యాల జంపుసరులు; మున్నగు సామగ్రిని సాహిత్యమునందు సమకూర్చుట, రాయప్రోలునుండి తరువాతి కవులు అరువు తెచ్చుకున్నవారు. ఈవిధంగా 'అమలిన శృంగార ప్రేమను, స్త్రీ ఔన్నత్యమును గూర్చి విపులంగా చర్చించి, రచించిన మేటికవి రాయప్రోలు సాహిత్యచరిత్రలో నవ్యభావాలను, రచనలో నవ్యతను, భావకవిత్వ నవ్యమార్గాన్ని స్థాపించి, కీర్తిని సాధించి తెచ్చిపెట్టిన ఘనుడు సుబ్బారావు. సాహితీ జగత్తులో, సాహితీప్రియులకు చిరస్మరణీయుడు సుబ్బారావు.

ఉపయుక్త గ్రంథాలు :

1) ఆధునికాంధ్ర కవిత్వము
2) తృణకంకణము
3) అభ్యుదయ కవిత్వము

—(*)—

# మనుచరిత్ర - పరిశీలనము II

– శ్రీ సి హెచ్. శ్రీరామశర్మ, ఎం. ఏ.

1-12-1980 తేదీన వెలువడిన సమాలోచన సంచికలో శ్రీ పి. ఏ. వి. వల్లభాచార్యులు గారు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి ఆపురి బాయకుండు లేల? అను శీర్షికతో 16-12-80 నాటి సంచికలో వ్రాసిన మనుచరిత్ర ఒక పరిశీలనము అను నా వ్యాసములోని మొదటి అంశమును గూర్చి తమకు తోచిన అభిప్రాయమును పాఠకుల ముందుంచిరి. అది సంతసింపదగిన విషయము. మకరాంక, శశాంక, మనోజ్ఞ శబ్దములు ఏ అర్థమును ప్రతీతం చేస్తాయి అనే విషయం నా వ్యాసంలో ప్రస్తావించబడినది కాదు. సమాసమునకు విగ్రహం చెప్పునపుడు మకరాంక శశాంకులకంటె (మనోజ్ఞమైన ఆకారం గలవాడు) అనే పంచమీ విభక్త్యంతముగా గ్రహిస్తే ఇతర స్థలములలోని (కవి) వచనములతో ఏకవాక్యత కుదురుతుం దని వ్యక్తీకరించాను.' శ్రీ శర్మగారు చెప్పినట్లు 'శృంగారమున సౌందర్యము అతి ముఖ్యమే' అని అంగీకరిస్తూ తరువాత 'కాని శృంగారమునకు మానసాహ్లాదకారకమైన సౌందర్యము ముఖ్యము' అని తమ నిశ్చయాన్ని వ్యక్తం చేసారు. నా వ్రాతలో మానసాహ్లాదకారకము కాని సౌందర్యమే శృంగారములో ముఖ్యమని నేను ప్రస్తావించలేను. ధార్మిక ప్రవరుడైన ప్రవరుని పరిచయంలో మొట్టమొదటి విశేషణం సౌందర్య ప్రతిపాదకం కావడంద్వారా జరగబోయే వరూథినీ ప్రవరగాథ శృంగార విషయము అని తెలుపుతున్నాడు మహాకవి అని తెలియజేసాను.

ఇక వారు చెప్పినట్లుగా సౌందర్యాన్ని విశ్లేషించి శశాంక శబ్దముచే మానసాహ్లాదకారక సౌందర్యాన్ని గ్రహించినానే చెప్పినదానికి చమత్కారావహమే గాని విరుద్ధముకాదు అని నా తలంపు. శశాంక శబ్దముచే ఆహ్లాదకత్వ ప్రతీతి కలుగు ననుటకు ఎంతో శ్రమించి శ్రీ ఆచార్యులవారు 'మకరాంకునివలె సుందరమూ, శశాంకునివలె ఆహ్లాదకరమూ అయిన రూపము కలవాడు అని చెప్పుకొనుట యుక్తమని తోచుచున్నది, అని వ్రాసినారు. మకరాంకుని కంటె సుందరమూ, శశాంకునికంటె నాహ్లాదకరము అయిన రూపము కలవాడు అని పంచమ్యంతంగా విగ్రహిస్తే వచ్చే దోషమేమిటో సెలవీయలేదు. పంచమ్యంతంగా చెప్పినట్లయితే వారి అభిప్రాయం ప్రకారము చెప్పిన అర్థంకూడా చమత్కారాధిక్యమును కలిగించడంలో సందేహం లేదు. వారు చెప్పే రెండు అర్థములకు ప్రతిపాదకం సమస్తపదంలోని మనోజ్ఞ శబ్దము ఒక్కటే! నా సౌందర్యాన్ని విశ్లేషించినందుకు సంతోషించగలను. కాని నా పంచమ్యంతాన్ని కాదనటానికి హేతువును ప్రకటించకుండా మకరాం

కునివలె శశాంకునివలె అనే ప్రాచీన వ్యాఖ్యానాన్ని అభ్యస్తం చేయడంలో వారి అభిప్రాయము తెలియుటలేదు. ఒక్క మాటలో చెప్పాలంటే పంచమ్యంతంగా విగ్రహిస్తే వచ్చే దోషమేమిటో వారు సెలవిస్తే నేను ప్రాచీన వ్యాఖ్యాతృమార్గాన్ని ఆనందంతో స్వీకరించగలను.

ఇక ఆపురిబాయకుండుటకు హేతువులలో సర్వైశ్వర్య సంపన్నత మాతాపితృసేవనము హేతువు అని వ్రాసాను. సంపదల కత డచ్చిన ప్రాధాన్యము లేకపోయినా ధర్మపరుడైనవానికి ధనలోపం ఉంటే అన్ని ధర్మములకంటె నిత్యమైన కుటుంబపోషణ నిమిత్తం దేశసంచారం అవసరమయి ఉంటును. శ్రీ ఆచార్యుల వారు చెప్పిన నిత్యంబులైన కృత్యంబులు దేశాంతరం భార్యతో కలసి సాగ్నిహోత్రుడై బయలుదేరితే అతిథి సంతర్పణములు అగ్నులు సురార్చన విప్రసపర్యలు సిద్ధిస్తాయి. సాగ్నిహోత్రులై ఆహితాగ్నులు తీర్థయాత్రాదులను (అవి కూడా విహితములు కనుక) చేయడం శిష్టుల సంప్రదాయమే కాని విరుద్ధం కాదు. అట్టియెడ వారి నిత్యకృత్యములు కుంటుపడవు. ఇక వృద్ధులైన పితరుల సేవ వారి సన్నిధియందే సాగుతుంది. 'తుహినగిరి కడ హొంద లేప (లేప శబ్దం వారి వ్యాసంలో లేదు. ముద్రణలో ప్రమాదం కావచ్చు) విహీనుడై కుందుచుండె నాతడు నన్ను నిముసంబు గానక నిలువలేని తండ్రి ఎంతగా వెదకునో ? సంధ్యాకాలముల నిలువెడల నీక కాపాడు తల్లి యెంత దుఃఖించునో అని మొట్టమొదట తండ్రిని, తల్లిని స్మరించిన ప్రవరుని భావాన్ని వ్యక్తం చేస్తూ మాతాపితృసేవ కత డచ్చిన ప్రాధాన్యమేది ? అని ప్రశ్నించారు ఆచార్యుల వారు.

అంతేకాక జీవత్పితృకులకు పితృసేవనము కూడా నిత్యకర్మలలోనిదనే ధర్మసూత్రాన్ని ఏల గ్రహింపరో తెలియుట లేదు. ఇతర నిత్యకర్మలకంటెకూడా పితృసేవనము విశేషధర్మమనే విషయాన్ని ప్రవరునివంటి ధర్మపరుడెరుగును కనుక నే వాటికంటె ముందుగా వారిని స్మరించడం జరిగినది.

న హ్యతో ధర్మచరణం
కించిదస్తి మహత్తరం ॥
యథా పితరి శుశ్రూషా
తస్య వా వచనక్రియా ॥
(రా. అ. 19 స. 22 శ్లో.)

న సత్యం దానమానౌ వా
యజ్ఞా వాప్యాప్తదక్షిణాః ॥
తథా బలకరాః సీతే
యథా సేవా పితుర్మతా ॥
(రా. అ. 30 స. 35 శ్లో.)

అనే రామచంద్ర సూక్తినికూడా ఈ విషయంలో స్మరిస్తే పైసందేహము రాకపోను. ఆ సమయమున చేయదగిన హోమియయున్ సురార్చన విప్రసపర్యయు జిక్కు అని వాటిని గ్రహించడం శ్రుత్యాదులలో పంచమప్రమాణమైన స్థానప్రమాణము ననుసరించి యుక్తమగును. హోమి మొదలగునవి నియతకాలికములు. పితృసేవనము అనియతకాలికము. ఆ పద్యంలో కూడా కడు వృద్ధులు అయిన తల్లిదండ్రులను స్మరించిన ప్రవరుడు మాతాపితృసేవనమునకు ప్రాధాన్యమీయనివాడుగా దుర్తింపబడటం శోచనీయము. మిగిలిన నిత్యకృత్యములు ఎక్కడ ఉన్నను నెరవేరును. పితృసేవనము నెరవేరదు. అది నెరవేరవలెనన్న వారికడనే ఉండవలెను. ఆహితాగ్ని ప్రవసించినను ఋత్విగ్ద్వారా అగ్నిసేవనము జరుగును. ప్రవసించినను అతిథ్యభ్యాగత సపర్యలు జరిపించవచ్చును. మాతాపితృసేవము స్వయముగా జేయవలెనను విధికూడ ధర్మశాస్త్రమున నుండుటచేత స్వయముగా ఆచరించిననే పితృసేవనము సిద్ధించును. కావున అదియే ఆపురిబాయకుండుటకు ముఖ్యహేతువు. మిగిలినవికూడా హేతువులు గావచ్చును. శ్రీ ఆచార్యులవారు 'అందువలన నతడాపురిబాయకుండుటకు హేతువు నిత్యంబులైన కృత్యములే కాని సర్వైశ్వర్య సంపన్నత, మాతాపితృసేవయు గావు, అనుట సాహసము. సంపదల నాతడపేక్షింపకపోయినను తద్భావము ద్రవ్యసముపార్జనార్థమైన దేశాంతర యానమును పరిహరించినది. తీర్థసందర్శనాభిలాష మిక్కుటముగా కలవాడయ్యును, సాగ్నిహోత్రుడై వెడలి సందర్శనము చేయు అధికారము అవకాశము ధర్మపురస్సరంగా కలవాడయ్యును. ఆపురి బాయకుండుటకు వృద్ధులగుటచే ప్రయాణాదులను చేయలేని తల్లిదండ్రులను సేవించడం హేతువు కాకపోదు. 'సర్వైశ్వర్య సంపన్నత మాతాపితృసేవయు కాదు' అనేకంటే వీటితోపాటుగా ఇతర నిత్యకర్మలనుకూడా చెప్పినట్లయితే పరిపూర్ణత సిద్ధిస్తుందంటే నాకభిమతమే. కావున శ్రీ ఆచార్యులవారు పై అభిప్రాయములను పునరాలోచించగలరని భావిస్తున్నాను.

ఇక 16-11-80 న ప్రచురితమైన నా పరిశీలనములో నాల్గవ అంశములో వీణా స్వరూపమును గూర్చి ప్రస్తావిస్తూ 'ఇక దీనికి పూర్వం ఉండే వీణకు చాలా తీగలు ఉండేవట. వీటినన్నిటిని తంత్రాగాను గుణస్థానములను పలికేటట్లు చూడడం మేళవించడమంటారు' అని నాటికి నా కుపలబ్ధమైన రీతిని తెలిపియున్నాను. వీణకు ఎక్కువ తీగలు ఉండటం కాదని, అప్పటి వీణలకు తత్తత్స్థానాపేక్షణముగా మేళవించుటకు వీలుగా చలతోన్సపానములుండెడివని వాటిని తంత్రీగానుగుణస్థానముల నుంచుటనే మేళనముగా వ్యవహరింతురని అట్లుగాక ఎక్కువ తీగలు ఉంటాయని భావించే పక్షంలోగూడా అట్టి రాగాదులు సంభవించినప్పటికీ వీణా

(తరువాయి 5 వ పేజీలో)

# కవులు చిత్రించిన "సత్యభామ"

- శ్రీ ననుమాస స్వామి, ఎం. ఏ.

సంస్కృత గ్రంథం హరివంశంలో ప్రప్రథమంగా సత్యపాత్ర కనిపిస్తుంది. దాని ఆధారంగా ఆంధ్రహరివంశం, పారిజాతాపహరణం, శ్రీ మదాంధ్రమహాభాగవతం, ఉత్తర హరివంశం, విజయ విలాసం మొ॥ గ్రంథాల్లో ఈపాత్ర అందంగా మలచబడి చిత్రించబడింది.

సత్యభామలో నేటి నాగరిక స్త్రీ స్వభావాలు, ధైర్యసాహసాలు, రసికత్వం, చిలిపితనం సుస్పష్టంగా గోచరిస్తాయి. ఆమెలో అసదృశమైన సహజ సౌందర్యం, అలౌకికమైన అనురాగమాధుర్యం, అనంతమైన హృదయద్రవీకరణ శక్తీ కానవస్తున్నాయి. ఇందుకేనేమో సాహిత్య సమీక్షాకారులకు సత్యభామ పాత్రమీద కన్నుపడింది. ఫలితంగా ఆయాకవులు రచించిన రచనల్లో ఆ పాత్ర వింతరూపాలను దిద్దుకొంది.

సంస్కృత హరివంశంలో సత్యభామ పారిజాత కుసుమ విషయాన తన తప్పు మన్నించమని కృష్ణుని చేత వేడించుకొంది. ఈకథ ఆధారంగా పారిజాతాపహరణ కావ్యంలో రూపమున్నగని కూరిమియు, గౌరవాన్ని, కలిగిందిగా చిత్రించబడింది. ఆ రూపప్రభావాన భర్తను దాసుని చేసికొనుటేగాక వాము పాదాన అతనితలను తొలగించే జాణగా రూపొందింది. 'వల్లవీకింకర' అని పసుల కాపరి' అని జుకు గొంకు లేక వెక్కసమంతా కళ్ళుబోసింది. చివరికి తనపంతం నెగ్గించుకొంది. 'కలలోననైన నవ్వులకైన' మున్నగు పద్యాలద్వారా సత్యభామ కృష్ణునిమీద ఎంతటి ప్రేమాభిమానాలు కలిగివుందో తెల్లమౌతుంది. అందుకే ఆమె ప్రణయరాజ్ఞిగా రూపొందింది. శ్రీకృష్ణుడు పారిజాతాన్ని పెకలించి తెచ్చుకొన్నప్పుడు వనపాలురు అతన్ని అడ్డగించగా 'హృదయేశ్వరు నింగర సంజ్ఞమాన్చి చన్గ్రేవల జాలుకొంగు సవరించుచు వీడిన కొప్పు బిగ్గిలం, జేవెడ దోపుచున్ ఇదియేమి యొకరిసొమ్మ మఘువు నిట బంపి సత్యభామా విధేయుం, వలన మరలంగ గొను టెపో వాసితనము' అని సవాల్ చేసింది. ఇచ్చట సత్య తన మగనిని మాట్లాడనీయక తానే వనపాలకులకు బదులు చెప్పుటలో ఆమెదిట్టతనం, గర్వం వెల్లడికావడమే కాక తనభర్త తనకు విధేయుడని సగర్వంగా ఆత్మవిశ్వాసంతో నొక్కిచెప్పింది. ఆమె స్వాతంత్ర్యాభిలాషిణి కావుననే పట్టిన పట్టు వదలక తనపంతాన్ని నెగ్గించుకొంది. ఈవిధంగా కృష్ణునకు సత్యమీదగల మక్కువేకాక సత్యభామ ధీరోద్ధతి కూడా ప్రస్ఫుటంగా ప్రకటించబడింది తిమ్మన సత్యాకృష్ణుల గాఢానురాగాన్ని గుర్తించి పాకం చెడని రీతిగా వారి ప్రేమను చిత్రించాడు.

పోతన భాగవతంలోకూడా సత్యభామ ప్రేమాభిమానాలు, విశ్వాసాలు గలిగియున్నా కొన్నిచోట్ల కొంత మెలుగులు దిద్దుకొంది. శ్రీకృష్ణుని వెంట యుద్ధరంగానికి పోయేందుకుపాయం ఆలోచించింది. దేవా! రాక్షసమూకను చెండాడే నీ ప్రావీణ్యం చూడాలని వుంది. మన్నించి నన్ను నీవెంట తీసుకు పొమ్మని పొగడ్తలచే భర్తను లోంగదీసుకొని బయలుదేరింది. నిజానికి సత్యభామ కృష్ణుని శౌర్యాన్ని చూచుటకు కాదట వెంటబోయింది. తాను ప్రియుని వీడి ఉండ లేదట. ఆ విషయం తెల్సిన కృష్ణుడు 'వత్సు! వేగమ నిలువుము! వల' దంటాడు.

నరకాసురవధా ఘట్టంలో గరుడ వాహనంమీద కృష్ణుని ప్రక్కను సంగర కథాలాపాలు వినుచు కలహానికి నరుడు గమకింపగా తమకింపక విలోకించి, శత్రు సంహారానికి పతికంటె ముందులేచి కేశపాశమును సవరించుకొని, చీర గట్టిగాగట్టి కట్టి చేత పైటను సవరించుకొని వీరావేశంతో విల్లుదాల్చి విజృంభించింది. ఆ వీరత్వ ప్రకటనమునకు, ధైర్యస్థైర్యాలకు మెచ్చి కృష్ణుడు కిల్లందియుగా 'వీరశృంగార భయ రౌద్రవిస్మయములు గలిసి భామిని యొప్పెనో కాక' అన్నట్లు మూర్తీభవించింది.

భాగవతంలో, ఉత్తర హరివంశంలో సత్యభామ కృష్ణుడు అందించిన విల్లందుకొని రథంమీద నిల్చి (పరుఁజూచున్ వరు జూచు; అరిఁ జూచున్ హరి జూచుఁ జూచుక) నా నేర్పు చూడుమని ప్రియునిపైని ఒక చూపును, నా శక్తిని చూడుమని రిపునిపైన ఒక చూపును పరుస్తుంది. ఈ చూపులు ప్రణయ రసాసారాన్ని, శౌర్య రసాసారాన్ని సాక్షాత్కరింపజేసి మనోహర భయంకర రూపద్వయంగా ప్రదర్శిస్తుంది. ఆ పాత్రయెడ కవులిద్దరి రూపచిత్రణకౌశలం మెచ్చుకోదగింది. పాత్ర చిత్రీకరణ ఔన్నత్యమే అంత.

---

( 4 వ పేజీ తరువాయి )

వాదకుల వైశిష్ట్యమును చూపే అవకాశం ఉండదని కావున పూర్వము చెప్పిన చలత్స్వానరీతి మాత్రమే వాస్తవము, సమంజసము అని సుప్రసిద్ధ వైణికులు శ్రీ మేడూరి నరసింహారావు (భాగ్యనగరము) గారు నా వ్రాసినదానికి సవరణ తెలిపిరి. వారికి కృతజ్ఞతలు తెలియజేస్తూ ఆ సవరణను మనస్ఫూర్తిగా స్వీకరిస్తూన్నాను.

'జయన్తి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః'

—+—

ఉత్తర హరివంశంలో సత్యభామ పాత్ర ప్రాబల్యాన్ని పెంచేందుకేమో, సమరంలో అసురుల తెగటార్చి ప్రకటిత వైభవలక్ష్మివోలె కనిపించిన సత్యభామ సంగరమునకు సంతోషించి కృష్ణుడు-

'చెలువ చెక్కుల నెలకొన్న చెమటదుడిచి
తరుణి యుదుట బైకొన్న కుంతలము లొత్తి
పొలతి పయ్యెద కొంగుపై పొందుపరచి'

ఆమె చేతి వింటిని తీసుకొని శత్రువుతో తలపడ్డాడని కవి వర్ణించాడు. దీన్నిబట్టి సత్యభామలో మోహనాకారుడైన కృష్ణుని ఆకర్షించేట్టి అనిర్వచనీయమైన శక్తియుక్తులు ఉండి ఉండా అని తేటపడుతుంది.

కృష్ణుడు రుక్మిణీ సత్యలతో పాచికలాడే ఘట్టంలో సత్యభామ మాత్సర్యముతో రోషం పొంగి కృష్ణుణ్ణి అతని పక్షాన్ని నూటిపోటు మాటలతో దూషించి 'పొత్తుగలసి నీవును, నీ తబళలు రెండు గెలిచేనం బరువడితోడన్' అని పలికింది. ఈతీరు గమనిస్తే పాచికలాటలో కూడా సత్యభామ కడు నేర్పరియని రూఢి అవుతుంది. అన్ని రంగాలలో ఆరితేరిందని అందంగా అర్థం కాక మానదు.

'పారిజాతాపహరణం' శృంగార రస ప్రధానమైన కావ్యమయినందున ప్రణయ సామ్రాజ్యాన సత్యభామ ప్రణయరాజ్ఞిగా రూపొందింది. ఆ రమణీమణి గుణాలను తిమ్మన ఎంతో మనోజ్ఞంగా వర్ణించి లోకాన స్త్రీల స్వభావ గుణాలను మధురంగా చిత్రించాడు.

భాగవత కవులు సత్యభామను వీర శృంగార భామగా చిత్రించుటే గాక సత్యాకృష్ణులను అలౌకికులైన శృంగార వ్యక్తులనుగా సృష్టించి చిత్రించినారు.

విజయ విలాసంలో చేమకూర కవి సత్యభామను పూర్తిగా చిలిపి పిల్లగాను, కృష్ణుని కొంటెవానిగాను చిత్రించాడు. భాగవతాదులలోకంటె నిందులో సత్యాకృష్ణులు 'లౌకిక మానవమాత్రులుగా' కనిపిస్తారు.

ఈవిధంగా సత్యభామ ఆంధ్రకవుల కలాలతో అందంగా చిత్రించుకొని సాహిత్యంలో సముచిత స్థానాన్ని అలంకరించిందనిన అతిశయోక్తి కాజాలదు.

—+—

# ఉపనిషత్తులు - భక్తి

(గతసంచిక తరువాయి) - శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, ఎం.ఏ.

గురుశిష్య సంవాదరూపమున కేనోపనిషత్తు పరమాత్మ స్వరూపమును చమత్కారముగ నిరూపించినది. ఉపనిషత్ప్రతిపాద్య మగు బ్రహ్మజ్ఞాన మెట్లు కలుగు నని శిష్యుని సందేహము. అందులకు గురువు 'తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా వేదాః సర్వాంగాని సత్యమాయతనమ్ ... ' ఇత్యాదిగా సమాధాన మిచ్చెను. శమ, దమ, సంపత్తులును, ఈశ్వరసమర్పణ పూర్వకమైన కర్మానుష్ఠానముచేగల్గు చిత్తశుద్ధిని ప్రధానముగా పేర్కొని, వీని ననుష్ఠించినచో బ్రహ్మజ్ఞానము కలుగు నని గురువు చెప్పెను. ఇవన్నియు భక్తిలక్షణములని గమనింపవలసియున్నది.

సంయమము అనగా ఇంద్రియ నిగ్రహము. ఇది మనోనిర్మలత్వమును గల్గించును. మనో నిర్మలత్వము భక్తిసాధనము. నిర్మలమైన హృదయమే కదా సర్వాంతర్యామికి నిజమైన ఆలయము. ఇట్టి మనో నిర్మలత్వమునుగూర్చి కఠోపనిషత్తు చక్కగా నిరూపించుచున్నది. ఇంద్రియములను వశవ పరచుకొనుట యెట్లో, అది యేల ఆవశ్యకమో ఉపమాన ప్రదర్శన పూర్వకముగా ఈయుపనిషత్తు వివరించుచున్నది.

జీవుని శరీరము రథము. అందలి జీవుడే యజమాని. బుద్ధియే రథసారథి. మనస్సు కళ్ళెము. ఇంద్రియములు గుఱ్ఱములు. రథసారథి సమర్థుడై కళ్ళెము లాగుచు గుఱ్ఱముల నదుపులో నుంచినచో యజమానికి మేలు గల్గును. బుద్ధి యను సారథి మనస్సనెడి కళ్ళెమును తన ఆధీనమందుంచుకొని, గుఱ్ఱము లని చెప్పబడు ఇంద్రియములను సవ్యముగా నడిపింప వలయును. అప్పుడే జీవునకు ఆత్మోన్నతి. లేనియెడల పునరావృత్తి రహితమైన మోక్షమునకాతడనర్హుడై, జరామరణ రూపమైన సంసార సాగరమందే పడియుండక తప్పదు.

'ఆత్మానగ్ం రథినం విద్ధి
శరీరగ్ం రథ మేవ తు।
బుద్ధిస్తు సారథిం విద్ధి
మనః ప్రగ్రహ మేవచ॥
ఇంద్రియాణి హయానాహు
ర్విషయాగ్ం స్తేషు గోచరాన్।
ఆత్మేంద్రియ మనోయుక్తం
భోక్తేత్యాహు ర్మనీషిణః॥
య స్త్వవిజ్ఞానవా న్భవ
త్యయుక్తేన మనసా సదా।
తస్యేన్ద్రియాణ్యవశ్యాని
దుష్టాశ్వా ఇవ సారథేః।
యస్తు విజ్ఞానవా న్భవతి
సమనస్కః సదా శుచిః।

'సతు తత్పద మాప్నోతి
యస్మా ద్భూయో న జాయతే॥
యస్త్వ విజ్ఞానవాన్ భవ
త్యమనస్కస్సదా౽శుచిః।
న స తత్పద మాప్నోతి
సగ్ంసారం చాధిగచ్ఛతి॥'

బుద్ధియను సారథి మనస్సను కళ్ళెమును స్వాధీనము గావించుకొన జాలని యెడల ఇంద్రియము లను గుఱ్ఱములు యజమానునికి అనగా జీవునకు కష్టనష్టములనే కలిగించును.

ఇంద్రియనిగ్రహ మెంత కష్టతరమో ఈ పోలికద్వారా మనము గ్రహింపగలము. అయినను అది అత్యంతావశ్యకముగాన, 'అభ్యాస వశమున దానిని సాధింపయత్నింపు' మని ఉపనిషద్వచనము.

ఇక, ఇంతటి తీవ్రమైన అభ్యాసముచే ప్రయత్నముచే సాధింపదగిన పరమాత్మ స్వరూప మెట్టిది? అది అనన్యసాధారణమైనది. తెలియనిదయ్యు పరిత్యజింప వీలులేని స్వరూపము. 'నేను' అను స్వరూపమునుగూర్చి మనకు తెలియదు. అయినను, దానిని విడిచిపెట్టుటకు వీలులేదు. అట్టి పరంజ్యోతి స్వరూపమును నిరూపించుటకే కేనోపనిషత్తు ప్రయత్నించినది.

పరమాత్మ స్వరూపము వాక్కులకందనిది. వాక్కునకు శక్తినిచ్చునదియు అదియే. మనస్సునకు మననముచేయు శక్తి పరమాత్మవలననే కలిగినది. కాని, మనస్సులోని ఆలోచనలకు అతీతమైనది పరమాత్మ. ఇట్టి నేత్రములకు చూడగల శక్తిని, శ్రోత్రములకు వినగల శక్తిని పరమాత్మయే ఇచ్చుచున్నను, చక్షురింద్రియములకు తెలియనిది పరమాత్మ. ప్రాణమునకు కదలికనిచ్చినది పరమాత్మ. కాని ఈ ప్రాణము పరమాత్మను గుర్తింపగ సమర్థముకాదు.

'యద్వాచా౽నభ్యుదితం
యేన వాగభ్యుద్యతే।
యన్మనసా న మనుతే
యేనాహుర్మనో మతమ్।
యచ్చక్షుషా న పశ్యతి
యేన చక్షూగ్ంషి పశ్యతి।
యత్ప్రాణేన న ప్రాణితి
యేన ప్రాణః ప్రణీయతే।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం యదిద ముపాసతే॥

అనగా: మనస్సునకు, ఇంద్రియములకు, అతీతమైన నిర్గుణ నిరాకార పరబ్రహ్మమును గూర్చిన జ్ఞానమును గల్గించుటయే ఉద్దేశము. ఉత్కృష్టమైన నిర్గుణభక్తి భావమునకిట్టి జ్ఞాన మెంతేని ఆవశ్యకము.

పరమాత్మ స్వరూపము వాక్కులకందరానిదని కదా! 'కేనోపనిషత్తు' చెప్పుచున్నది. తైత్తిరీయోపనిషత్తు కూడ ఈవిషయమును పునరుద్ఘాటించుచున్నది. పరమాత్మ స్వరూపమును తెలిసికొనగోరి, ప్రయత్నించిన వాక్కు అట్లు తెలిసికొనజాలక, మనస్సుతో, సహ (అనగా మనోగతమగు విజ్ఞానములో కలసి) వెనుదిరుగుచున్నది.

'యతో వాచో నివర్తన్తే
అప్రాప్య మనసా సహ।
ఆనందం బ్రహ్మణో విద్వాన్
న బిభేతి కుతశ్చనేతి॥'

ఇట్లు వాఙ్మనసగోచరమైన పరమాత్మ స్వరూపమును తెలిసికొనినవాని కెన్నడును, దేనికిని భయము గలుగదని ఈ ఉపనిషత్తు చెప్పుచున్నది.

పరమాత్మను గూర్చిన సమగ్రమైన జ్ఞానము గలవారిని భయమేకాదు, ఎట్టి మానసిక వికారమును అంటజాలదు. సమస్తమును ఈశ్వరాంశగా గుర్తించిన మానవునకు నిరంతరము బ్రహ్మానందమే. తనయందఖిలప్రాణులను, సకలభూతములయందాత్మను చూడగలవానికి జుగుప్స లేదు. సమస్తప్రాణులయందాత్మవద్భావన గలవారిని మోహశోకములు దరిచేరవు. ఇట్టిజ్ఞానమును సంపాదించి, భగవదర్పణ బుద్ధితో సత్కర్మానుష్ఠానము గావింపవలెనని ఈశావాస్యోపనిషత్తు.

'యస్తు సర్వాణి భూతా
న్యాత్మన్యేవానుపశ్యతి।
సర్వభూతేషు చాత్మానం
తతో న విజుగుప్సతే॥
యస్మిన్ సర్వాణి భూతాని
ఆత్మైవాభూ ద్విజానతః।
తత్ర కో మోహః కః శోకః
ఏకత్వ మనుపశ్యతః॥'

భక్తిలో పరమోత్కృష్టమైనది ఆత్మనివేదనము. సంపూర్ణమైన ఆత్మసమర్పణ భావమే శ్వేతాశ్వతరుని దృష్టిలో మోక్షప్రాప్తి హేతువు. అందులకే, ఆతడు 'ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే' అని ఆత్మసమర్పణ భావముతో ప్రార్థించుచున్నాడు.

భక్తి (మార్గ) సాధనములలో గురుభక్తి కెంతయు నుత్కృష్టమైన స్థానము గలదు. దైవభక్తితోపాటు గురుభక్తియు కావలయు నని శ్వేతాశ్వతరఋషి చెప్పుచున్నాడు.

'యస్య దేవే పరాభక్తి
ర్యథా దేవే తథా గురౌ।
తస్యైతే కథితా హ్యర్థాః
ప్రకాశన్తే మహాత్మనః'

లక్ష్యమునకభిముఖముగ సాధకుడు పయనించుటకు దారిచూపువాడు గురువు. సాధకునిమనసులో విజ్ఞానమును సృష్టించు బ్రహ్మ గురువు. అట్టివిజ్ఞానమునకు స్థితిని గల్గించు విష్ణువు గురువు అజ్ఞానమును లయమొనర్పగల మహేశ్వరుడు గురువు.

'గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః
  గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్ పరం బ్రహ్మ...'

సాక్షాత్ పరబ్రహ్మమే గురు వని సంప్రదాయోక్తి. కావున ఆధ్యాత్మిక సాధనకు గురుభక్తి ఎంతయు సహకరించును.

'తపః ప్రసాదాత్ దేవప్రసాదాచ్చ
బ్రహ్మహ శ్వేతాశ్వతరోఽథ విద్వాన్।'

తపఃప్రభావముచే, దైవకృపచే మానవుడు పరబ్రహ్మ స్వరూపము నెఱుంగగలడని శ్వేతాశ్వతరోపనిషత్తు.

దైవ కృపకు సాధన కావలయును. తపస్సనగా విశేషమైన ప్రయత్నము. తీవ్రమైన నిరంతరాభ్యాసముచేత నే సాధనలో నిలకడ కుదురుకొనును. జీవాత్మ పరమాత్మ నన్వేషించుటలో తపించును. ఆత్మదర్శనముద్వారా ఆ పరంజ్యోతి పరిష్వంగమునకై పారవశ్యముతో పరితపించును. ఇట్టి పరితాపమే తపస్సు. ఇదియే 'పరాభక్తి' యని, ప్రేమభక్తి యని నారద, శాండిల్యాది భక్తిశాస్త్రజ్ఞు లభిభాషించుచున్నారు. ఇట్టి తపముచే (ప్రయత్నముచే) దైవకృప గల్గును. దైవకృపచే బ్రహ్మజ్ఞానము సిద్ధించును. అట్టి జ్ఞానమే కైవల్యము. ఇందులకు ప్రాథమికముగా కావలసినది తపస్సు. అట్టి తపస్సును అభ్యాసదశలో సాధకునకు నేర్పువాడే గురువు. గురుభక్తి జ్ఞానసాధనకు అనివార్యమైన లక్షణము.

ఉపనిషత్తులు భక్తిచర్చను పలుచోట్ల గావించినవి. దైవకృప లేనిదే బ్రహ్మస్వరూపప్రాప్తి గలుగ దని ఉపనిషత్ప్రధానాంశము. దైవకృపను సంపాదించు మార్గము 'దైవభక్తి'యే అని వేఱుగ చెప్పనక్కరలేదు గదా! 'దైవభక్తి' యనగా ఈశ్వరార్పణ బుద్ధితో గావించు సత్కర్మానుష్ఠానమనియే ఉపనిషత్తు లందు ప్రధానముగా కన్పట్టును.

మనోనిర్మలత్వము గూర్చి ఉపనిషత్తు లధికముగా ప్రస్తావించినవి. శుద్ధసత్త్వగుణప్రధానమగు అంతఃకరణమే సర్వాంతర్యామిని చూడగల దని ఉపనిషదృషుల ప్రవచనము. ఆత్మజ్ఞానమును ప్రబోధించి ఎంతటి ప్రబోధముగొన్నను అనుభవముచే గాని దైవదర్శనము కాజాల దని వారు సూచించిరి. ఇట్లుపనిషత్తులు భక్తి, కర్మ, జ్ఞానాత్మకమార్గమును సంసారతరణోపాయముగ జూపుచున్నవి.

జ్ఞానముచే దైవదర్శనము కలుగునని ఉపనిషత్తులు చెప్పినపుడెల్ల, భక్తిద్వారా జ్ఞానముచే బ్రహ్మప్రాప్తి ఉపనిషత్తుల ఉద్దేశ మని గ్రహింపవలసి యున్నది. ఎవనియందు పరబ్రహ్మకు కృపగల్గునో ఆతడే ఆ పరబ్రహ్మను చేరగలడు.

అందులకే, సర్వోపనిషత్సారమైన భగవద్గీత స్పష్టముగా—

'భక్త్యా మా మభిజానాతి
  యావాన్యశ్చాస్మి తత్త్వతః।
తతోమాం తత్త్వతో జ్ఞాత్వా
  విశతే తదనన్తరమ్॥'

అని పేర్కొనుచున్నది అంతమాత్రమే కాక, 'న వేద యజ్ఞాధ్యయనైర్న దానైః' అని, 'భక్త్యాత్వనన్యయాశక్యః' అని భక్తి ప్రాథమికత్వమును, ప్రాధాన్యమును చాటుచున్నది భగవద్గీత. 'విశ్వరూప సందర్శన యోగ' మిదియే—

కర్మ, జ్ఞానములు భక్తిసహితములైనపుడు మాత్రమే ఫలప్రదములగు ననుట మన ఆధ్యాత్మిక తత్త్వములోని జీవసూత్రము.

అనుబంధము:

వేదములు ప్రధానముగా మూడుభాగములు. అవి సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకములు. 'సంహిత' ఆధిదైవికమైన భక్తికి ప్రాధాన్యము నిచ్చుచున్నది. ఉపాసనా కాండ అని దీనికే మరియొక పేరు. భక్తి, కర్మ, జ్ఞానములు మూడును వేదములందే చెప్పబడినవి కావున, అవి పరస్పర పోషకములే కాని, విరుద్ధములు గావని అంగీకరింప వచ్చును.

ఉపనిషత్తులతో సమానముగా బ్రాహ్మణములు కూడ వెలసినవి. ఆరణ్యకములందున్న యుపనిషత్తులు జ్ఞానకాండను వివరించుచుండగా, బ్రాహ్మణములు కర్మకాండను పేర్కొనుచున్నవి. ఆరణ్యకము లాధ్యాత్మికతను ప్రబోధించుచుండగా, బ్రాహ్మణము లాధిభౌతిక తత్త్వమును తెలియజెప్పుచున్నవి. ఆరణ్యకములు నిర్గుణ భక్తి తత్త్వమును, బ్రాహ్మణములు సగుణ భక్తి తత్త్వమును స్పష్టముచేయుచున్నవి. ఉపనిషత్తులు నిర్గుణబ్రహ్మోపాసనమును, ప్రణవస్వరూపారాధనమును ప్రవచించుచుండగా, అట్టియారాధన భావము నుండి ప్రతిమారాధనమునకు దారి యెట్లేర్పడినదో బ్రాహ్మణములు నుడువుచున్నవి. భౌతిక తత్త్వమునకు సంబంధించిన కర్మకాండలో విగ్రహారాధనము ప్రారంభమైనది. ప్రకృతిశక్తులకు పేర్లుపెట్టి దేవతామూర్తులుగా భావించి ఆరాధించుటతో పాటు, ప్రాథమికమైన విగ్రహారాధన దశ ప్రారంభమైనది. తరువాతి కాలమున బ్రాహ్మణములలో చెప్పబడిన విధముగా విగ్రహారాధనకు ప్రాధాన్యము హెచ్చినది.

బ్రాహ్మణముల కాలముననే బౌద్ధమతము పైకి రాజొచ్చినది. నైతిక పవిత్రతకే ప్రాధాన్య మిచ్చిన బౌద్ధమతముగాని, ఆధ్యాత్మిక జ్ఞానమునకే మొగ్గు చూపిన ఉపనిషత్తులుగాని సామాన్యమానవుని ప్రభావితుని గావింపలేకపోయిన వనవచ్చును. భగవంతుని ఉనికిని గూర్చి ఏమాత్రమూ పేర్కొనని బౌద్ధము పట్ల మానవులకు అంతగా ఆసక్తి లేక

పోయినది. జ్ఞానముతో కూడిన సత్కర్మానుష్ఠానము నుపనిషత్తులు పునరుద్ఘాటించుచున్నవి. ఇట్టిస్థితిలో మానవుడు ఏకేశ్వరోపాసన పట్ల దృష్టి సారించినాడు. నామరూపాత్మకమైన భగవంతుని గూర్చిన ఆసక్తి మానవునిలో హెచ్చు కాజొచ్చినది. వేదకాలము నాడు తనసఖునిగా, ప్రియునిగా భావించిన దైవముపట్ల ప్రీతి మరల ప్రారంభమైనది. ఇట్టిప్రీతియే ఇష్టదేవతారాధనమునకు దారితీసినది. ఇట్లు మానవులు తమతమ ఇష్టదైవముల వంకకు చూపులు నిగిడ్చియుండుటచే, క్రమముగా నామరూపాత్మకములైన భిన్న భిన్న దైవతములకు సంబంధించిన కథలు, గాథలతో పురాణవాఙ్మయము ప్రారంభమైనది.

చారిత్రకాధారములను బట్టి సుమారు క్రీ. పూ 300 సం॥ల కాలమునాటికి శివ, విష్ణుప్రాబల్య మేర్పడి, ప్రజలలో కొందరు శైవులుగా, కొందఱు వైష్ణవులుగా మారిపోయినారు.

Macdonell ఇట్లనినాడు.

'We gather from the account of Megasthanes that about 300 B·C. these two Gods (Siva and Vishnu) were already prominent and the people were divided into Saivites and Vaishnavites.'

శైవ, వైష్ణవ మత ప్రాబల్యములతో సమానముగనే నారాయణుని పేరిటిఆరాధనము కూడ ప్రారంభమైనది. శతపథ బ్రాహ్మణమందలి కొన్ని తావుల 'నారాయణుని' యాధిక్యమును గూర్చి పేర్కొనబడినది. కాని, తరువాత క్రమముగా నారాయణుడు విష్ణువే యని ప్రజలు గుర్తించిరి. 'Hiriyanna' ఈవిషయమును ప్రస్తావించెను. 'రుద్ర, శివనామములవలెనే విష్ణునారాయణ నామములు పర్యాయవాచకములని ప్రజలు గుర్తించుట, క్రమముగా విష్ణువు నారాధించుట పెరిగినది.' అని ఆత డభిప్రాయపడెను.

విష్ణువే అధికుడని మానవులు భావింపసాగిరి. ఋగ్వేద కాలమునాడు కూడ విష్ణువు అలక్ష్యము గావింప బడలేదు. ఇతర దేవతలతో సమానముగా గుర్తింపబడినాడు. కాని వేదకాలమున ఆధిపత్యము ఇంద్రునిదిగా కన్పట్టును. బ్రాహ్మణముల కాలమునాటికి విష్ణువు ఆధిపత్యము పెరుగుట ప్రారంభమైనది. దేవతలలో అగ్ని చివరివాడుగా, విష్ణువే ప్రథముడుగా వర్ణింపబడినారు.

'అగ్ని ర్వై దేవానాం అవమః - విష్ణుః పరమః। తద న్తరేణ సర్వా దేవతాః॥'

వీరిద్దరిమధ్య గలస్థానములలో తక్కిన దేవతలందఱును పేర్కొనబడిరి. (ఐతరేయ బ్రాహ్మణము.)-

శతపథ బ్రాహ్మణములో నొక కథ గలదు. ఆహారసంపాదనకై దేవతలు ఒక యజ్ఞమును తలపెట్టిరి. ఆ యజ్ఞమును ముస్ముందుగా ముగించినవారికి దేవతలలో అగ్రతాంబూల' మని నియమమును విధించుకొనిరి. ఆనియమము ప్రకారము అందు గెలుపొందిన విష్ణువునకు ఆధిపత్య మీయఁబడినది. ఆహార సంపాదనార్థము గావించిన యజ్ఞములో గెలుపొందిన విష్ణువు ప్రాణికోటికి పోషకుడైనాడు. మరింత ఆరాధనీయుడైనాడు. విశ్వమందలి ప్రాణికోటి కాధారమైన అన్నము విష్ణుస్వరూపమే యని వర్ణించుచు, 'మైత్రేయోపనిషత్తు' విష్ణు ప్రాశస్త్యము నుగ్గడించుచున్నది.

అథాన్యత్రాప్యుక్తం విశ్వభృద్వా నామైషా
తనూర్భగవతో విష్ణోర్యదిద మన్నమ్।
ప్రాణోవా అన్నస్యరసో మనః ప్రాణస్య
విజ్ఞానం
మనసఆనందో విజ్ఞానస్యేత్యన్నవాన్॥'

కఠోపనిషత్తు కూడ వేఱొక రీతిలో విష్ణుప్రాబల్యమును ప్రస్తావించుచున్నది.

'విజ్ఞానసారథి ర్యస్తు
మనః ప్రగ్రహవాన్నరః।
సోఽధ్వనః పార మాప్నోతి
త ద్విష్ణోః పరమం పదమ్॥'

అనంతమైన ఈ జీవయాత్రలో జీవాత్మ చేరదగినట్టి అత్యుత్తమ గమ్యస్థానమీ విష్ణుపద మని కఠోపనిషన్మంత్రము.

ఈ విధముగా విష్ణువుపట్ల 'మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్' అనునంతటి ప్రబలమైన భక్తిభావము మానవుల హృదయములందు నాటుకొన్నది.

ఆధారగ్రంథములు:

ఈశావాస్యోపనిషత్తు, కేనోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు, ప్రశ్నోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు, ముండకోపనిషత్తు, శ్వేతాశ్వతరోపనిషత్తు, ఉపనిషత్తులు - మధ్వ వివరణము, ఉపనిషత్తులు - రామానుజ వ్యాఖ్య, నారదభక్తి సూత్రములు, శాండిల్య భక్తిసూత్రములు, భగవద్గీత, ఐతరేయ బ్రాహ్మణము, శతపథ బ్రాహ్మణము, వివేకానంద సంపూర్ణ గ్రంథావళి, భక్తియోగము, A History of Sanskrit Literature - Macdonell, Outlines of Indian Philosophy - Hiriyanna.

[ఆంధ్ర విశ్వవిద్యాలయము తెలుగు శాఖలో శ్రీమతి డాక్టర్ కోలవెన్ను మలయవాసిని గారి పర్యవేక్షణలో 'భాగవతము - భక్తితత్త్వము' అను అంశమును గూర్చి నే జేయు పరిశోధనకు సంబంధించిన వ్యాస మిది-వారికి నా నమస్సులు.]

—)*(—

అభ్యుదయ కవితార్ణవం

# దాశరథి 'పునర్నవం'

– శ్రీ డా. జి. బి. యస్. ఆచార్య, ఎం ఏ.; పిహెచ్.డి.

( గతసంచిక తరువాయి )

'పునర్నవం' అనే ఖండికలో అబద్ధాలాడడమెంత సులభం అవదుసుమా కవిత అల్లడం అని భయపెడుతూనే, హరిశ్చంద్రుడంతగా అలమటించనక్కర లేని కావ్యకల్పనకు అని ధైర్యం చెప్తాడు. రోజూ కనబడే వస్తువుల్లోనే రోజూ కనబడని క్రొత్తదనాన్ని చూచి, రోజూ పొందని అనుభూతిని పొందడమే కవిత్వమంటాడు. ఇంకా –

'దూరాన పొడిగాలి దెబ్బలకు
తునాతునకలై పోయిన ఆకలతో
ముసలి మొహం పడిన వృక్షంమీద
యౌవనం చిగిరించడం కవిత్వం'

అని చెప్పి సామాజిక వ్యవస్థను ప్రతీకాత్మకంగా స్ఫురింపచేస్తాడు. ఇది దాశరథి అభ్యుదయ ధోరణికి నిదర్శనం. ఒకప్పుడు కష్టాలతో, బాధలతో, క్రుంగి, కృశించిన సమాజం, ఒకనాటికి సుఖాలలో చైతన్యవంతంగా కలకలలాడ గలదని కాల విపరిణామాన్ని సూచించాడు. అందుకు వృక్షాన్ని, యౌవనాన్ని ప్రతీకలుగా గ్రహించి ఉచితజ్ఞతను ప్రకటించాడు.

'మనకంటె లక్షయేండ్లు పెద్దది
మన నెత్తిమీదున్న ఆకాశం
దూదిపింజల్లాంటి కొత్తమబ్బుల్లో
తొంగిచూడ్డమే పునర్నవం'

అని పునర్నవానికి తన సొంత నిర్వచనాన్ని చెప్పి, ఆవిరాల్చిన మనస్సులో మళ్ళీ పూలుపూయించగల నేర్పును ప్రదర్శించాడు.

'తుదిశిశిరం' అనే ఖండికలో అది వస్తున్నదని యెంత తీవ్రంగా హెచ్చరించాడో, మళ్ళీ అది పోతుందనీ, ఓడిపోతుందనీ అంత నిశ్చయంగాను, నిశ్చలంగాను ఆశాభావాన్ని వెలిబుచ్చాడు.

'మానవ మారణమునకై
మహికప్పిన మహాజ్వరం
తుది శిశిరం, మహాజ్వరం'

అని శిశిరం ఎంతటి ప్రమాదకరమైనదో తెలిపాడు. అయితే ఈ శిశిరమనే రాక్షసిని సంహరించటానికి మానవతా మలయవాయు సంచారములే. నిశితమైన ఆయుధములని పరిష్కారాన్ని సూచించాడు. ఇంకా శాంతి పుష్పబాణాల్ని కురిపించి, శిశిరాన్ని హతమార్చవచ్చని ఉపాయం చెప్పాడు. కనుక శిశిరానికి భయపడనక్కర లేదు. దానికి ఓటమి తప్పదు.

'ధరణి మరల ఒక్కమాటు
తరుణత్వం పొందుతుంది'

అని ఆశించవచ్చు. నిబ్బరంగా శ్వాస పీల్చుకోవచ్చు.

'రాజులమాటే కాని
రైతులమాట వినం, వినం;
అణుబాంబుల మాటేకాని
మనిషినిగూర్చి అనం అనం'

ఇది ఇవాల్టిమాట. కానీ రేపటిమాట వేరు. వీటన్నిటికీ విలువ నశించి, ఇవాల్టివన్నీ అబద్ధాలైపోతాయి అయితే రేపటిమాటేమిటో కూడా దాశరథే ఊహించాడు.

'కవిమాటకు విలువ హెచ్చి
కలహం మాట నశిస్తుంది!
రూపాయికి విలువలేని
రోజు రేపు వస్తుంది!'

ఈ వ్యూహ అక్షరాలా నిజమని, బుద్ధిగా ఆలోచిస్తే ప్రతి ఒక్కరికీ తెలుస్తుంది. కవిక్రాంతదర్శి అనే సూక్తిని దాశరథి నిరూపించాడని పై గీతం సాక్ష్యమిస్తుంది

'మస్తిష్కంలో లేబొరేటరీ' అనే సుదీర్ఘ గేయంలో దాశరథి బహుముఖీన ప్రజ్ఞ వెల్లడవుతుంది. కవిగానే కాక, ఒక చరిత్రకారుడుగా, ఒక విజ్ఞానశాస్త్రవేత్తగా ప్రతిభావంతుడుగా మనకు దర్శనమిస్తాడు.

ప్రఖ్యాత కవి, విమర్శకుడూ అయిన శ్రీ సోమసుందర్ 'జాతిమస్తిష్కంలో లేబొరేటరీ – శ్రీ దాశరథి'[1] అనే శీర్షికతో ఒక వ్యాసం వ్రాసాడు. అందులో ఆయన ఇలా అంటాడు.

'ప్రతిభ నవోన్మేషశాలిని. ప్రతిభాసముద్రుడైన కవి నిత్యప్రయోగశీలి. శాస్త్రవేత్త లేబొరేటరీలో ధ్యానమగ్నుడై ప్రయోగాల పరిశోధనలు జరిపే కవి! స్వీయమస్తిష్క లేబొరేటరీలో ధ్యానైక చిత్తంతో ప్రయోగాలు జరిపే కవి శాస్త్రవేత్త! అయితే ఆధునిక కవిగా దాశరథిమాత్రం–జాతిమస్తిష్కం అనే మహత్తర లెబొరేటరీలో, నిరంతర పరిశోధన వ్యగ్రుడు!'

నిజంగా దాశరథి నిరంతరం పరిశోధనలు జరిపే శాస్త్రవేత్త. లేకపోతే –

'మథనపడే మేధావుల
శిథిలాశలు చివురించే
రసరాజ్యం లెబొరేటరీ!'

అని అనగలడా? ఆయన మస్తిష్కమే ఒక లేబొరేటరీ. అది యెప్పుడూ తెరిచే వుంటుంది. జాతిపురోగతికై రకరకాల పరిశోధనలతో నిండి వుంటుంది. మానవుడికి ఎంత తిండికావాలో, ఎంత హాయి కావాలో అవి అన్నీ కల్పించటానికై మార్గాన్ని అన్వేషిస్తూనే వుంటుంది. లోకంనిండా విరివిగా శాంతి పందేరీతిని

క్రొత్తరకం విత్తనాన్ని కనిపెడుతూ వుంటుంది. ఇంతకంటె లెబొరేటరీ ప్రయోజనం ఇంకేముంటుంది?

'చిటికెన ఆటంవంటి బతుకులో ప్రణయం కదాచిత్' అన్న దాశరథికి –
'రాజుల పాదాలక్రిందుగా పరిచిన
రైతుల రతనాల బ్రతుకుల తివాసీలు'

తలుచుకున్నప్పుడు వేదనలో జన్మించిన ఊహింపులు –

'తొడగటానికి వ్యాకరణ సూత్రపు రెడీమేడ్ దుస్తులు లేక దిసమొలల్తో లోకానపడి స్వేచ్ఛంగా విహరిస్తాయి.

'మొహం జోదారో శిథిలాల లోతుల లోకి –

శతాబ్దాల మట్టిపొరల క్రిందిబొగ్గై పోయిన పురాతన నాగరికతా గర్భంలోకి–

సూర్యుడు అస్తమించిన జాడల్లోకి నౌకదారి'

అని పురాతన చరిత్రను, చరిత్రపరిశోధనలను ప్రస్తావిస్తూ–
'మరోదారి
మస్తిష్కంలోని మాయింటికి'
అని చెపుతూ, అసలుదారి ఇదే ననీ, ఇది చూపించిన గమ్యమే మానవజాతిపురోగతికి మార్గాన్వేషణచేస్తుం దనీ ప్రకటిస్తాడు.

'అజంతాలో
శిలాసుందరికి లేని
క్షుద్బాధా సుసంచలనం
పల్లెపడుచు కున్న దని
గమనించుకో భాయీ!'

అని హెచ్చరిస్తాడు. ఆకలిమంటల్ని చల్లార్చలేని వాళ్లు కళాపోషణలు చేయటానికి అనర్హు లని నిరసిస్తాడు.

'చల్లనిపాలు తాగే పిల్లులవంటి
రసిక శిఖామణుల నాల్కలు
వేడివేడి కవిత్వం చురుకుదనం
సహించేదాకా రాలేదు.'

అని నిర్మోహమాటంగా, నిర్భయంగా చురక అంటించాడు. వ్యక్తిత్వం వున్నవాడు ఎవడైనా ఈ చురకకు 'అబ్బా' అనకతప్పదు. దాశరథి మార్గానికి రాకుండా వుండటానికి మనసుఒప్పదు. ఇలా ఈ ఖండికను గురించి రాసుకుంటే పోతే ఎన్ని పుటలైనా చాలవు. అసలు ప్రత్యేకంగా ఈ ఒక్క ఖండికే ఒక మహాకావ్యం.

బ్రతుకు నాగజెముడుకూడా పూలు పూయించే ప్రతిభ, మిక్కిలిగా ప్రోటీనులు కల మెతుకులను పండించే ప్రజ్ఞ గల దాశరథి–

'రేపు కాబోయే మార్పులు
తెచ్చిన గాయాల బాధకు ఓదార్పులు'

అని మార్పుని మనసారా ఆహ్వానించే అభ్యుదయకవి.

'ఈజరిగే దంతా అబద్ధాల గెలుపు
అసలు ఇది వినాశానికి పిలుపు'

అని వర్తమానంలోని అన్యాయాలను, అక్రమాలను నిశితంగా విమర్శించాడు.

'ప్రణవంలో త్రివర్ణాలు
ప్రతిఫలించడం కద్దు
క్రొత్తరకం త్రివర్ణాలు
ఎత్తిచూపుతున్నా నిక్కడ'

అని తను నూతనంగా ఆలోచిస్తూ, మనలను కూడా ఆలోచింప చేస్తాడు. ఆయన చూపే నవ్యత యేమిటి? అని ప్రశ్నించుకుంటే, వెంటనే–

'అకారం ఆకారంబు నలుపు
ఉకారంపు టుడుపులు తెలుపు
మకారంపు మంటలు ఎరుపు
మహాప్రజాయై నమః ఓం'

అనే ఆశ్చర్యకరమైన, అద్భుత సమాధానం దొరకుతుంది. సంప్రదాయ క్షేత్రంలోంచి నవ్యతాసస్యాన్ని పండించగల, సమన్వయశీలి – అభ్యుదయకవి కర్షకుడు అయిన దాశరథి యేదిరాసినా ప్రజాపరమైనదే, ప్రజాంకితమైనదే. 'మహాప్రజాయైనమః ఓం' అని జపించే పవిత్రవ్యక్తిత్వంగల ప్రజాకవి దాశరథి – ప్రగతి కవితల సీరథి.

'శవం బతకడం ఎంతవిచిత్రమో
మనం మేలుకోవడం అంతచిత్రమే
ఎవడో కొత్తరకం మేటివైద్యుడు
ఏదో కొత్తతరహా ఔషధం వాడి
వుండాలి.'

అనే ఆశ్చర్యాన్ని ప్రకటించిన, వింత ప్రవృత్తిగల దాశరథి 'ఏమైతేనేం– వెళ్ళి చూచిరావడం మంచిది'అని మేల్కొన్న మనిషిని చూడ్డానికి బయలు దేరాడు. ఈనాడు ప్రతీచిన్న విషయం ఏదోఘన విజయంగా పరిగణింప బడుతున్నది. అలాంటప్పుడు 'మేల్కొనడం' సామాన్యంకాదు. మహా మహా ఘనమైన విజయం అని దాశరథి వ్యంగ్యంగా, జాతిని మేల్కొలిపాడు.

'నిశాబీజం విచ్చివచ్చిన
తమోవృక్షం మనకు నిచ్చిన!
అవల వెలుగులు
వెలుగు పులుగులు,
కాంతి ఝుంఝులు వూడ్చి వేయగ
తమోవృక్షశ్రేణి మాయగ
ప్రజాజాగృతి;
ఇది పురోగతి'

ఇదే దాశరథికి కావలసిన మేలుకొలుపు. సమత అనే రేకటితో వ్యత్యాసాల చీకటిని చితకబాదగల దాశరథి–

'మంచు బరువులుమోసి బతికే
హిమాచలముల కొరకు కాతికే
భానుకిరణం'

లాంటివాడు. మంచుబరువులు మోసి బతికే హిమాచలాన్ని సమాజానికి ప్రతీకగా చెప్పి ఎంతో ధ్వనిని సాధించాడు.

'అరే, వెర్రి మొర్రి మానవుడా
కాలం నిన్నుకొడుతోంది ఎడాపెడా!

అదో, తూర్పుదక్షిణాల బుజాలు
కలుస్తున్నాయి, విను నిజాలు,
పిరికితనం మృత్యువు
ధైర్యం సంజీవనీ గుళిక,
అసహాయుల్ని బాధించు కాలం
జారిపోతోంది పడమరలోకి
అనాథులు నిద్రలోంచి దూకి
చూస్తున్నారు తూరుపులోనికి'

అని, పిరికి మానవుణ్ణి హెచ్చరిస్తూ, అనాథుల అభ్యుదయ రాగాల భవిష్యత్ సంగీతాన్ని వినిపించాడు. అయినా గతాన్ని గతంలోని పోరాటాన్ని మరచిపోలేదు. అందుకే –

'పురాతన మహావీరుల
త్యాగరాగం అద్దుకున్న
ఈనాటి మహా ప్రభాతం'

అని, ఈనాడు మనం అనుభవిస్తున్న ఈ వెలుగంతా గతంలోని మహావీరుల త్యాగ ఫలమే నని కొనియాడాడు.

ఉదయాలెన్నో నశిస్తున్నా, ఉదయ సమయ సౌందర్యం ఎలా చావదో అలాగే–

'మనం కష్టాలు పడి ఆర్జించిన
మందారం వంటి స్వాతంత్ర్యం
ఏ బాంబు పాదాల క్రిందనో
నలిగి అణగారి పోవచ్చు
కానీ – తమ్ముడూ !
స్వాతంత్ర్య సుందరత
ఉదయ భామినీ తరుణారుణ కపోల
యుగళి
మెరసిన దివ్య కాంతివలె
శాశ్వతంగా బతుకుతుంది.'

అనే ప్రత్యూష ఘంటికారహస్య రమ్య గీతాన్ని మనకు విన్పించి–

'రానున్న కాలం నిలబడి
ప్రజలకు నేర్పుతుంది కొత్తనుడి

అనే భవిష్యదాశయాన్ని ఘంటాపథంగా దిక్కుల్లో మారుమోగించాడు.

ముసలి భాస్కరుని చూపుల మసకలలో తప్పిపోయి కనుపించని కాలాంశాన్ని తాను దర్శించి, 'రవి గాంచనిచో కవిగాంచును గదా!' అనే సూక్తికి బాసటగా నిలబడ్డాడు–

'అర్థమగునె సగం సగం?
అచుంబితం మనోజగం
అందుకొరకె కలం ముక్కు–
నందు సందు చేసుకో;'

'కలం ముక్కునందు సందు చేసుకో' అనే సందేశంలో, ఆయన దృష్టి ఎంత నిశితమైనదో వెల్లడవుతుంది. కావ్యంలో ఖండిక 'అశ్రుదీపం.' ఇందులో దాశరథి భవిష్యత్తు పంటలను పండించాడు. బంగారపుగుండెలగంటలను మోగించాడు.

'భరతాంగన ఫాలభాగమున
గోరోచన పాటల తిలకం
యువాంగనానయన రాగమున
అశ్రుదీపికా జ్యోతిః ఫలకం
రుద్రవీణలో అశ్రుదీపికలు
అశ్రుదీపమున రుద్రవీణలు'
అంటూ–
'భరతమాతృ పాదాగ్రమ్ముల
చెంత వంచి మన శిరస్సుల
విశ్వశాంతి గీతం ప్రోయగ
రుద్రవీణ వాయించేరూ!'

రండి, రండి, ముందుకు రండి అని బీద బిక్కిని మేలుకొలుపుతూ అగ్నిగీతిని పాడించాడు; కాలకస్య నాడించాడు. ఈఖండకృతి దాశరథి అభ్యుదయభావాలకు అక్షరాకృతి.

శ్రీ పి. వి. రత్నంగారు ఈ కావ్యాన్ని సమీక్షిస్తూ చివరగా ఇలా రాసారు.

'ఆయన 'అగ్నిధార', 'రుద్రవీణ', 'మహాంధ్రోదయం', 'మహాబోధి' మొదలైన మాణిక్యాల వంటి మహాకావ్యాల మాటేమిటని అడిగితే, నాదొక్కటే సమాధానం. శ్రీ దాశరథి ప్రతిభను చూపడానికి, చాటడానికి, మనమంతా సగర్వంగా చెప్పుకోవడానికి ఒక్క 'పునర్నవం' చాలదా అని'?

ఈ కావ్యానికి ఇది ఎంతగానో తగిన యోగ్యతాపత్రం. అసలు, దాశరథి మొదటి మూడుకావ్యాలూ ఒకయెత్తు; ఈ ఒక్కకావ్యం ఒకయెత్తు. 'అగ్నిధార'లో రగుల్కొన్న దాశరథి కవితాగ్ని – 'రుద్రవీణ' తీగలద్వారా ప్రసరించి, 'మహాంధ్ర' మంతటా వ్యాపించి, 'పునర్నవంలో' నవనవోన్మేషంగా తన విరాట్ స్వరూపాన్ని ప్రదర్శించింది. దాశరథి వ్యక్తిగా చిన్నవాడే అయినా, కవితావ్యక్తిత్వంలో మహోన్నతుడు – మహోగ్రుడు. ఈమధ్య ఓ పత్రికలో దాశరథి అన్నట్లుగా –

'పాత కథలుపరవాలి
ప్రజల వ్యథలు తలవాలి
ప్రజాస్వామ్య సామ్యవాద
పథం మీద నడవాలి.'[2]

అప్పుడే దాశరథిని, ఆయన 'పునర్నవం' కావ్యాన్ని సరిగా అర్థంచేసుకుని, గౌరవించిన వాళ్ళం అవుతాం!! *

1. సమాలోచన: 1-2-80. సంపు. 3. సంచిక 7.
2. 'నిండుగుండెలో వెండి పండుగ' (కవిత): ఈనాడు. 1-11-80.

—•••—

# ఆధునిక నవలికకు శ్రీ కుటుంబరావు చేకూర్చిన సంపద

— శ్రీ సోమసుందర్.

( గతసంచిక తరువాయి )

కళావాణి మారుతున్న అభిరుచులతో పాటు మారక పోవడంతో కొడికట్టనారంభించింది. 'అరాచకమైన అసంస్కారాన్ని' అతను ద్వేషించకనూ తప్పడం లేదు; ఆశ్రయించకనూ తప్పడం లేదు. పురజనుల కోరికపై గయోపాఖ్యాన నాటక ప్రదర్శనం మళ్ళీ జరిగింది. రామ్మూర్తికి సుభద్రపై ఏవగింపు తగ్గడమే కాదు; ఆమెతో షికార్లు కూడా ప్రారంభించాడు. అతని నాటకానికి ఆమెయే ప్రథమశ్రోత! ఆ దశలో కళ్యాణి తండ్రికి జబ్బు చేయగా పుట్టింటికెళ్ళింది. పైగా ఆమె ఐదో నెల గర్భవతి కూడాను. రామ్మూర్తి నాటకం పూర్తి చేసిన రాత్రి సుభద్రా, తనూ సినీమాకి వెళ్ళారు. ఆ రాత్రి తమ యింటివద్దనే గడిపాడు. ఆ అనుభవం అతనిలో చాలా మార్పు తెచ్చింది.

నాటకం రిహార్సల్సు జరుగుతున్నాయి. శుద్ధవ్యావహారికంలో రాసిన అతని నాటకం ఆ నటుల నోట సరిగా పలకలేదు. వెంకటేశ్వర్లు గ్రాంథికంలోకి మార్చమంటే - తప్పేదేముంది? ఆ విధంగా చ్యుత సంస్కారానికి దాసోహం కాక తప్పలేదు రామ్మూర్తికి!

పశ్చాత్తాపం రంగస్థలమెక్కేసరికి కీర్తి అపకీర్తి జమిలిగానే లభించాయి. దానితో నాటకరంగంపై వ్యాసాలు రాయనారంభించాడు. కళ్యాణికి ఆడపిల్ల కలిగింది. సుభద్రకు సినీమా ఛాన్సులు రానారంభించాయి. ముఖ్యంగా ఒక జమీందారు తాను తీయబోయే సినీమాకు సుభద్రను నాయికగా కాంట్రాక్టుకు వచ్చాడు. ఆమె ఒత్తిడిపై నెలజీతంతో రామ్మూర్తి కాంట్రాక్టు రాసుకున్నాడు. సుభద్రను లోపాయికారీగా వాడుకుందుకే తప్ప సినీమా తీయడం ప్రధానం కాదు. అందుకే రామ్మూర్తికి ఏపనీ చెప్పనేలేదు. విముఖుడై బయటపడటమెలాగని యోచిస్తున్న సమయంలో రామబ్రహ్మం గారినుంచి ప్రోత్సాహమందింది. ఒక చిత్రాన్ని నిర్మించదలచే పరిచయస్థులకు రామ్మూర్తిని అప్పగించారాయన.

రెండో ప్రపంచ యుద్ధం జోరుగా సాగడంతో రామ్మూర్తి నిలవలో పడ్డాడు. ఫిలిం కరువేర్పడింది. బొంబాయినుంచి తక్కువ ధరకు తెచ్చి, మద్రాసులో ఎక్కువధరకమ్మాడు. బొంబాయి వర్తకులు కాగితం కరువు గురించి చెప్పగా కొని నిలవచేశాడు. ఆ దశలో మద్రాసులో ఆంధ్రమహాసభ రజతోత్సవమూ దానితోపాటు నాట్యకళా పరిషత్తుసభా, నవ్యసాహిత్య పరిషత్ సమావేశమూ గొప్ప తిరునాళ్ళవలె జరిగాయి. ఈ మహాసభల ప్రభావం తనపై ఎలా ప్రసరించిందీ కుటుంబరావు గారు - 'నేను మార్కిస్టునెలా అయ్యాను?' అనే ఆత్మకథాత్మక వ్యాసంలో వివరించారు. రామ్మూర్తి సాహిత్యపరిషత్ సభలు చూడటం అదే మొదలు. పాత కవిమిత్రులంతా కలిశారు. శ్రీశ్రీ, ఇంద్రగంటి, పిలకా మొదలయిన యువరచయితల పరిచయమూ కలిగింది. ఒకనాడు సభా కార్యక్రమాలు కాగానే ట్రామెక్కి యింటికివస్తుంటే - తన ప్రక్కను కూర్చున్న వారు తెలుగు సాహిత్యాన్ని గురించి చర్చించుకుంటున్నారు. అర్థంలేని పద్యాలు చదవనారంభించారు. అదేదో సైకిక్ ఆటోమాటిజం అనేది ఒఠి హంబగ్ అనుకున్నాడు. వాళ్ళచర్చలలో ప్రొలిటేరియట్ లిటరేచర్ కావాలన్నదీ వింటాడు. 'కళ అనేది ప్రేక్షకుడి మీదా, పతిత మీదా శాశ్వత ప్రభావం కలిగించే శక్తి' అంటూ డొకడు. సమకాలీన సాహిత్య సిద్ధాంత విచికిత్స ఎంతో ప్రాధాన్యం వహిస్తుందీ నవలలో! ఆనాటి ప్రఖ్యాత సాహితీ కళామూర్తులందరూ యథార్థనామాలతో ప్రవేశిస్తారు.

యుద్ధభీతి - జపానువాడు మననగరాలపై చెదురుమదురుగానైతేనేం బాంబులు వేయడంతో పరాకాష్ఠకు చేరుతుంది. మద్రాసు నగరాన్ని ఖాళీ చేస్తుంటారు ప్రజలు. పుకార్లు వ్యాపిస్తున్నాయి. రామ్మూర్తి మాత్రం చేజిక్కిన అవకాశాన్ని వినియోగించుకుంటాడు. వ్యాపారం సాగిస్తాడు. అనేక వస్తువులు కొని నిల్వచేశాడు. ధరలు పెరుగుతున్నాయి. బెంగాలు క్షామం మాడ్చేస్తోంది. మలబారు కరువుతో తపిస్తోంది. దేశంలోని ధాన్యమంతా ఓడెక్కి యుద్ధావసరాలు తీరుస్తోంది. రామ్మూర్తి సరుకు పదింతల ఖరీదుకు వదిలించుకొని - యుద్ధం పరిసమాప్తి చెందేనాటికి పాతిక వేలు నిల్వలో ఉన్నాడు. దానితో ఆలోచనలూ ఆందోళనలూ మారజొచ్చాయి.

ఇదివరకెన్నడూ లేని రాజకీయాలపై మొగ్గు కొత్తగా యేర్పడింది. స్వాతంత్ర్యోద్యమ ఘట్టాలన్నీ సువర్ణాక్షరాలతో లిఖించదగ్గవే అనిపించింది. అతనీ విషయాల్ని గురించి యింతకు ముందెన్నడూ ఎందుకు పట్టించుకోలేదో అతనికే ఆశ్చర్యంగావుంది. పైగా ఇప్పుడతని మనసుకు ఒక సత్యం స్ఫురిస్తోంది. ఆ ఉద్యమాలన్నిటికీ త్వరలో సత్ఫలితాలు లభించనున్నాయని! కాని అప్పటికే కాంగ్రెస్‌ను విమర్శించేవారి సంఖ్య విపరీతంగా పెరిగింది. అతనికి జవాబు తోచలేదు. బొత్తిగా అలగాజనం రాజకీయాలు మాట్లాడేస్తుంటే అతనికి అసహ్యం వేసింది. ఇదివరలో లీలానాటక సమాజం వాళ్ళని చూసినపుడూ ఇలాంటి

అభిప్రాయమే కలిగింది. అతనిది గబ్బిలం బుద్ధి!

అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. మహాసభ జరుగుతూంటే తానూ వెళ్ళాడు. అందులో కొందరు తనకు పూర్వపరిచితులే ఉండటంకూడా అతనికి అబ్బురంగానే వుంది. వాళ్ళంతా కమ్యూనిస్టుల వలలో చిక్కుకపోయినందుకు బాధపడ్డాడు. ఒకనాడు కృష్ణశాస్త్రి, ఉపన్యాసమూ, కావ్యగానమూ తనను సాహిత్యలోకంలోనికి ఎగరేసింది. (పు.82) అభ్యుదయ రచయితల మహాసభలో జరిగిన ప్రదర్శనాలు శిల్పవంతంగా లేకపోయినా-వేలకొలది ప్రేక్షకులు ఎందుకు ఆకర్షితులవుతున్నారో అతనికి తెలియలేదు.

ఈ సందర్భంలోనే రామ్మూర్తి దంపతులకు పట్నవాసంపై విరక్తి కలిగింది. సొంతూరిలో సొంతయింట్లో కులాసాగా ఉంటే మంచిదనిపించింది. 'ఇంటికి పోయి హాయిగా ఉందాం పట్టండి' అందామె. వ్యాపారంచేసి వేలకొలదిగా లాభాలుగడించిన వాడికి పదిపన్నెండెకరాలు కొనుక్కుని వ్యవసాయం చేయడమంటే చికాకనిపించింది. 'చెరకు తిని బెండు నమిలినట్లు తోచింది ... దేశమంతటా సమ్మెలు చెలరేగుతున్నాయి. ఏదో పనిచేసి పొట్టపోసుకోవడమిప్పుడతనికి నీచంగా కనిపించడంలేదు. కాని ఏపని చేసినా అపాయం కలగదనే హామీ కనిపించడంలేదు. తనలా బ్లాక్‌మార్కెటు చేసి ధనంసంపాదించిన వారు అందరిచేతా తిట్లు తింటున్నారు. అలాంటి సందిగ్ధ స్థితిలో అతన్ని వెదుక్కుంటూ ఒకకుర్రాడు వచ్చాడు. కళావాణి పాతపత్రికలుంటే ఒకసారి చూడనివ్వమన్నాడు. తనకథ పడిందట. కాపీ చేసుకుంటానన్నాడు. రామ్మూర్తి అతన్ని ప్రసంగంలోకి దింపాడు. ఖరాఖండిగా అతనోమాట చెప్పాడు. 'మూలసూత్రాలు తెలిస్తేనేగాని పైపైవిషయాలంతుపట్టవు.' అని. సంఘంలోని అశాంతికి దోపిడీయే కారణమన్నాడు. అంతా తరగతులవారీగా దోపిడీకి గురవుతున్నారన్నాడు. మధ్యతరగతివారు పైతరగతులచే దోపిడీచేయబడుతూనే క్రిందివారిని దోపిడీచేస్తున్నారు. కళలూ రాజకీయాలూ – కష్టజీవులే సృష్టించే రోజు వస్తోందన్నాడు. దాన్ని ఉపేక్ష చేసి లాభం లేదని ఖచ్చితంగా చెప్పేస్తాడు.

ఆ కుర్రాడు రామ్మూర్తి ఆలోచనల్లో కలవరం కలిగిస్తాడు. అతను చెప్పిన విషయాలలో అబద్ధంగాని అన్యాయంగాని ఉన్నట్టనిపించలేదతనికి. కాని అంగీకరించలేదు. కొన్ని పుస్తకాల జాబితా యిచ్చి వాటిని క్షుణ్ణంగా చదివితే జీవితం గురించి బోధపడుతుందని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ పుస్తకాలు చదివితే నిజంగా అతనికి అశాంతే కలగవచ్చు. కాని ఆ అశాంతి వాంఛనీయమైనది. దానినుంచే ఏదైనా బయటపడవచ్చు. అతను రచయితగా మేధావిగా లోగడ సంపాదించిన కీర్తి నిజానికి సంఘానికి ఉపయోగపడవచ్చు.

ఈ ఆశావాదంతోనూ, భవిష్యార్థ సూచనతోనూ ఈనవలిక ముగుస్తుంది. అంటే అరుణోదయాన్ని సాధించేసినట్లు గాక, దానిని స్పష్టంగా చూడగలిగే చూపుడు వ్రేలును సారిస్తూ ఈ గ్రంథం ముగుస్తుంది. అక్షరపరంగా సర్వసమస్యా పరిష్కారానికి ఎందరో అల్పప్రతిభులు పూనుకుంటూంటారు. అలాకాక పాత్రను ఆలోచనలలో సైతం కలవరం కలిగిస్తూ ముగించడంలోనే ఉత్తమ ప్రతిభ ద్యోతకమవుతుంది. అతని ముందుకెన్నో ఆలోచనలు తెస్తుంది. ఆలోచనల గజిబిజిని పరిష్కరింపబడం సిద్ధాంత గ్రంథాల పని. కళాస్వరూపాల (Art forms) పని కానేకాదు.

ఈ నవలని గురించి ఇంత విపులంగా సమీక్షించడం ఎందుకంటే – ఈ అరుణోదయమే కుటుంబరావు సాహిత్య జీవితంలో నిజంగా అరుణోదయంగా భాసించింది; ఆయన పూర్వనవలికలకు భిన్నంగా తనపాత్రలకు మోల నూతన జీవనసమస్యలను సాక్షాత్కరింపచేసింది; తర్కించింది; పైగా దాదాపుగా ఇదే కథా ప్రణాళికతో తదుపరికాలంలో రాసిన ఆయన గ్రంథాలెన్నో సాగాయి. ఏఏ నవలికల్లో కథాసంవిధానంలో గాని, కథాపథకంలోగాని సాదృశ్యం ఎంతవరకూ ఉందో, వైవిధ్యమెంత వరకూ ఉందో పరిశీలించడానికి కూడా ఈవిపులీకరణ దోహదం చేస్తుంది. అందుకేఇంత విపులీకరణ అవసరమైంది.

తదుపరికాలంలో కుటుంబరావు రాసిన నవలికల్లో సర్వంకష వైవిధ్యం ఎందుకు స్పష్టంకాలేదు? అనే ప్రశ్నకు వేరేసందర్భంలో ఆయనే ఇలాసంజాయిషీ చెప్పుకున్నారు.

'ప్రతిగొప్ప కథకుడూ ఒకేఒక కథ రాస్తాడు. కావలిస్తే దాన్నే మళ్ళీ మళ్ళీ రాస్తాడు. ఆ కథను అయిదారు వివిధ సమయాల్లో వేరువేరు పేర్లతో చదివిన తరువాత సంఘం ఆకథకుణ్ణి గుర్తిస్తుంది. నీరాజనం పడుతుంది. కథావిషయంలో నూతనత్వమూ, సహజత్వమూ, ఉదాత్తతా దృక్పథమూ అనేవిగాని, రచనాశిల్పంలో విశిష్టతా, ఏకత్వమూ, ధ్వనీ మొదలైనవి గాని సంఘం అడగదు. వాటిని గురించి విమర్శకులు తమ గొప్పతనం చాటుకోడానికి ఏమేమిటో రాబుతారు. సంఘానికి అదంతా అనవసరం. సంఘానికి పాతకథలు కావాలి తెలిసిన కథలు కావాలి అవి ఫలానావాడి సొత్తని సంఘం స్పష్టంగా గుర్తించాలి. అప్పుడు సంఘం ఆ కథకుణ్ణి గుర్తిస్తుంది. గౌరవిస్తుంది. ప్రతిసారీ మరోకథ రాసేవాణ్ణి గురించి ఏమనుకోవాలో సంఘానికి

నిజంగా తెలీదు. సంఘంలో నిత్యమూ జరిగే సంఘటనే కానివ్వండి. ఒక్కసారి అచ్చులో చదివినంతమాత్రాన సంఘం తలకెక్కదు. దశాబ్దాలపాటు చదవగా చదవగా సంఘం దాన్ని ఆమోదించటం మొదలుపెడుతుంది. ఎంత అభూతకల్పన అయినాసరే. అందుచేతనే మన సంఘానికి అనేక-వేలమార్లు విన్న రామాయణ కథ తెలిసినంత బాగా, కొన్ని వందలసార్లు మాత్రమే విన్న భారతకథ తెలియదు...' (అరుణోదయం. పుటలు 14-15)

సాహిత్యపరంగా అల్పప్రతిభుడైన రామ్మూర్తి కథారచనను సమర్థించడానికి, పాత్రగత ఆలోచనలను చిత్రించడానికీ రచించిన యింత సుదీర్ఘ విచికిత్స ఆపాత్రను సృష్టించిన రచయిత మనసుపైనే ప్రభావం కలిగించదా అనే సంశయం కలుగుతుంది. అది యితరేతర నవలికల పరిశీలనలో ధ్రువపడవలసిన సత్యమే.

శ్రీ కుటుంబరావు ఇలాంటివే మరికొన్ని ఆర్గ్యుమెంట్లలో ఇటీవలి దశాబ్దాలలో సైతం మరికొన్ని వ్యాసాలూ రచించారు. కథలలోనూ వెల్లడించారు. రామ్మూర్తి రాసిన నమూనా కథలను గురించి మరిరెండు సూత్రీకరణలు కూడా చేశారు. వాటిని ఆరంభంలోనే ఉల్లేఖించడం జరిగింది. ఈ దీర్ఘాంశాన్ని యీ సందర్భంలో ఉల్లేఖించవలసిన అవసరముందనే అక్కడ తెల్పకుండా దాచినది.

తెలుగు కథకులు సాధారణంగా ఇలాంటి నమూనా కథలు (Pattern Stories) రాస్తున్నారని యెద్దేవా చేయడానికే ఈ వ్యంగ్య సిద్ధాంతం రూపొందించారా? అంటే దానికి కొంత ఆధారం కనిపించక పోదు. కుటుంబరావు కన్న ముందుతరం కథకుల్లో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, చలం, మల్లాది రామకృష్ణశాస్త్రి గార్ల కథలలో స్వీయాను-

కరణం జాస్తీగానే లభిస్తుంది. ఆ బలహీనతను అవహేళన చేయడమే కుటుంబరావు ఆశించిన ప్రయోజనం. అలాంటి బలహీనతలో తానుపడకుండా కాపాడుకోవాలి. అది స్పష్టంగా కనిపిస్తోందా? ప్రపంచ ప్రఖ్యాత కాల్పనిక సాహితీ స్రష్టలు-టాల్‌స్టాయ్, చెహోవ్, గోర్కీ, రోమారోలా, మపాసా వంటివారి రచనలలో ఇలాంటి సాదృశ్యాలు అతివేలమై పోయాయా అనేదికూడా ఆలోచనీయముగా మనముందుకు వస్తుంది.

ఏమైనా ఇరవయ్యోశతాబ్దం-జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ సాధించిన అపూర్వ జయాపజయాలను విస్పష్టంగా ప్రతిబింబింపజేసిన మహారచయిత శ్రీ కుటుంబరావు. ఈ శతాబ్దంలో ప్రధాన పరివర్తన దశ ఏభయ్యేళ్ళనుకుంటే - (1930-'80) ఆదశకు ఇంత సర్వతోముఖ ప్రతినిధిగా నిలిచి జాతిని నడిపించిన మహారచయిత మరొకరు లేనేలేరు.

(నా- 'జాతికి జ్ఞాననేత్రం' నుంచి)

—)*(—

# వీరాభిమన్యుడు (ఏకపాత్రాభినయం)

భాషాప్రవీణ, శ్రీ ఎస్. ఎస్. ఆర్. మోహనశర్మ.

(భారత సంగ్రామమున అర్జునుడు లేకున్న సమయము జూచి ద్రోణుడు పద్మవ్యూహమును పన్నెను. అందు ప్రవేశించుట మరెవ్వరికీ చేతగాక ప్రవేశము మాత్రమే తెలిసిన అభిమన్యు కుమారుని నాటి యుద్ధమునకు సేనానిగా ధర్మరాజు నియమించిన తిరువాత...) అనగా సేనాపతి యలంకరణతో రంగప్రవేశము చేయవలెను.

(ప్రవేశించి, సంతోషాతిరేకముతో) ఆహా! ఎన్నినాళ్ళకు నా మనోభీష్టము నెరవేరనున్నది? నిరంతర కౌరవగత జాజ్వల్యమాన క్రోధాగ్నికి నేడే పర్వదినము. దిక్కులు పిక్కటిల్ల గర్జించుచు మదీయ ధనుష్టంకారములతోను, ఖడ్గ ప్రహారములతోను, గంభీర మృగరాజు అడవిని వేటాడిన పగిది ఆ కౌరవ కురంగ హతకులను, దుష్టచతుష్టయాది నరరూప రాక్షసులను లెక్కకుమిక్కిలిగా నిర్జించి మత్ క్రోధాగ్నికి ఆహుతులుగా జేసెదను. బహుదిన నిక్షిప్త మదీయ యుద్ధ కౌశలము ఈనాటికి గదా రూపు దాల్పనున్నది... ఎన్నటికీ నావాంఛ నెరవేరుట! బహుదినంబులనుండి తటివేచియున్న బెబ్బులివలె లంఘించి, ఆ కౌరవ కురంగసమూహమును మట్టుపెట్టక మానుదునా? దావానలంబునం బడు శలభంబుల రీతి వీరు నా యస్త్రపాతంబుల బడకుందురా? నేటికి గదా ఏతత్ క్షుద్రులకు మత్ కృత మరణము ప్రాప్తిల్లనున్నది... ఆహా! నేడెంత సుదినము!

పద్మవ్యూహమట! పద్మవ్యూహము. మజ్జనకుడు లేకున్న సమయము జూచి గురువర్యుడైన ద్రోణుడే పద్మవ్యూహమును నిర్మింపబూనునా? దానిని భేదింపలేకున్న మా జ్యేష్ఠ పితృపాదులగు ధర్మజుల బట్టుకొనిపోదు రట. (పండ్లు కొరుకుచు) ఆఁ! ఎంతటి దురాలోచన...ఎట్టి నయవంచన...వీరి యెట్టి వంచనలైనను యీ అభిమన్యు సమక్షమున ప్రుక్కిపోవలసినదే. ఇట్టి పద్మవ్యూహంబులు వేయియైనను నీ వీరకిశోరముముందు వ్యర్థులై పోవలసినదే. దానిని ప్రయ్యలు గావించి ఏతదంతర్గత మహాశత్రునివహంబుల నొక్క త్రుటిలో భస్మీభూత మొనర్చి వ్యూహమధ్యంబున కర్ణ, శకుని, దుశ్శాసనాది దుష్టత్రయ పరిరక్షితుడై, నికృష్ట జీవుడై, అస్మత్ మాతాపితలను కడగండ్ల బెట్టిన యీ దుర్యోధను దేహంబును నా కరవాలంబున కాహారంబు గావించి

ఇంతటితో నీ ఘోర భారత సంగ్రామము నంతంబు గావించెద.

ఆనాటినుండి యెట్టులో ఓపికతో సహించితిని. నాయెడల వీతిహోత్రుడు తాండవమాడుచున్నాడు. సమయ సమారంభమునకై అర్రులు చాచుచున్నాడు. ఆ టక్కరి టిక్కుల శకుని మాయాజాల ద్యూత కౌశలముతో మజ్జనకుల రాజ్యశ్రీ నపహరించి కులుకుచున్న మీ నాల్కలు వేయిచీల్కలు చేసినను, మీ దేహంబుల మచ్చున నొక్క మాంసఖండమ్మును సైతము గన్పింపకుండ నుగ్గునూచము గావించినను నాకు లేశంబైన పాపం బంటునే?

(బాధగా) నాటి సంఘటన తలచినంత నా హృదయము వ్రక్కలైపోవుచున్నది. అణువణువున దావాగ్నులు చెలరేగుచున్నవి. తనువంతయు దారుణాస్త్రములు గ్రుచ్చినట్లగుచున్నది. (క్రోధముగా) ఓరీ! దుర్మదాంధీభూత కాముకాధములారా! ఏమి చూచుకొనిరా మీకా మిడిసిపాటు? మజ్జనకులం ఆనాడది మాయాద్యూతమని గ్రహించియు, ధర్మబద్ధులై, మీవంటి తుచ్ఛులకు సైతము తల యొగ్గవలసి వచ్చినదిగదా! ఎంతటి దురవస్థ పట్టినది? ధర్మజు నాజ్ఞ శిరమున దాల్చుటచే గదా అఘటనఘటనానైపుణీ కుశలులై, నిరంతరం జగజ్జేగీయమాన విక్రములై, బహువిధ శస్త్రాస్త్ర ప్రయోగోపసంహారాది ప్రక్రియానిరతులై, అనవరత ధనుర్ముక్త నారాచ చ్ఛేదితశత్రు దేహులై, అతిభయంకర సింహబల, బకాసుర, జరాసంధాది దుష్టనికృష్టజీవనుల రుధిరంబుల నాస్వాదించు కాలాంతకులై, ధర్మావతారులైన మజ్జనకులు మిమ్ముల వధింపక విడచినది!

(క్షణమాగి) ఛీ! ఛీ! తుచ్ఛులైన మీవంటివారి ప్రాణంబులు తీయుటకు మజ్జనకుల గదాదండ గాండివాది కార్ముకంబులు వలయునా? ఒక్క కనుసన్న నిచ్చిన చాలు. నేనును, నా సోదరుడైన ఘటోత్కచుండును వీరందరి నొక్కుమ్మడిగా సంహరింపజాలమే? (కత్తిపై చేయి వేసి) ఆ! ఖడ్గరాజమా! ఎంతటిమహోన్నతావకాశము నీయెడల తిరోముఖమైనది.

సమస్త దేశాగత రాజకంఠీరవ మస్తకన్యస్తమణి నికర, కాంతిపుంజ భాసమానపాదుడై, రాజసూయయాగ సమారంభ, సమయ, సమాగత, సమస్తజనసందోహ వందిత పాదారవింద విలసిత ధరాధినాథుడై, అమరలోక దేవతాగణ కీర్తిత యశోవిరాజమానుడై, అజాతశత్రుడై, చండతరదోర్దండ ప్రతాపమండనుడై, మూర్తీభూత ధర్మావతారుడైన మదగ్రజనకుడేనా... ఆనాడు పాంచాలీ పరాభవసమయమున నిండుసభలో శిరము వంచి మిన్నకయున్నది!

ధర్మజుని పట్టపుదేవేరియై, రాజసూయావభృథస్నాత కేశపాశయై, పాండుభూపాలకుల యశోవిభూషితయై, అగ్నిసంభూతయైన, మా మాతృమూర్తి గదా, యీ దుష్ట దురహంకార దుర్విదగ్ధ వక్రీభూతచిత్త దుశ్శాసన చండాలునిచే వస్త్రాపహరణ ఘోరపరాభవము పొందినది? (బాధగా) అయ్యో! ఎంతటి దుర్గతి పట్టినది. ఇట్టి దుష్కృత దర్శనము గాంచియు నిర్వీర్యులమై యుండవలసి వచ్చినది గదా! వాని యన్నిటికీ నేడే ప్రతికృతి. ఈ సింహకిశోర విజృంభణము నింతకు మున్నెన్నడు ఆ దుష్టహతకులు చవిచూచియుండలేదుగాబోలు. మద్భుజాప్రతాప పాండిత్యప్రకర్ష చవిగొన నేటికి గదా కాల మాసన్నమైనది. ఓరీ! దుష్టులారా! నిలుడు! రణరంగమ్మున నిలుడు! మీ యంతమ్ముల జూచినగాని నా మనస్సంక్షోభ మారదు.

(దుర్యోధను నుద్దేశించి) ఓరీ! దుర్యోధనా! చేతగానితనంబున నాటివోలె మాయాద్యూతంబున రాజ్యశ్రీ నపహరించి కులుకుట గాదురా! ఇది బాహుబల మండిత ధనుష్ఖడ్గసంభరిత వీరాభిమన్యు కుమారునితో వైరమురా!! ధైర్యమున్నచో రణమున నిలువుమురా! ధరాధిపుడైనవాడు రణమున మరణమునైన నోపునుగాని మీవంటి తుచ్ఛ కార్యకర్తృత రాజవంశంబులకే మాయని మచ్చ యయ్యెగాదె! నేటితో మీ కుటిల ప్రయత్నములు దరిజేరినవి. కాల మాసన్నమైనది అందువలననే పద్మవ్యూహమును నిర్మించి మీయంతమ్ముల మీరే వాంఛించినారు.

సోదరా! ఘటోత్కచా! శీఘ్రమే సమాయత్తుడవు కమ్ము. మన యిరువురి వాంఛలు సఫలీకృతములగు కాల మాసన్నమైనది. అస్మత్ శస్త్రాస్త్ర బాహుబలాది యుద్ధనైపుణీ ప్రదర్శనార్థమే ఈ అనల్ప కల్పనా పద్మవ్యూహ నిర్మాణము. సమరశంఖారావజనిత మహోత్కృష్ట గంభీర నినదము మత్ హృదయ చిరకాల వాంఛితము.

ఏతత్ వ్యూహ ప్రవేశంబు గావించి పటుతర, అరివీర భేదనోద్భట మార్గణ విద్యుల్లతాభీలంబై, దిగంత భీషణ రణిత ధనుష్టంకార, ప్రళయ పర్జన్య గర్జానిర్ఘోషంబై, శత్రునివహాపుట, భేదనోద్దీప్త, శంఖారావ ధ్వనితంబై, వికట విస్ఫుర ధారాసముజ్జ్వలిత శత్రుకంఠలుంఠన క్రియాపాటవ ఖడ్గోద్దీప్తంబై, రథ గజ తురగ పదాతిదళ సమూల సంహరణోద్యోగంబై పర్వ, ముద్గర-భేదనోద్యోగంబున లాఘవ లక్ష్యశుద్ధి మెరయ, విజృంభించి చక్రూతిం ఛేదిల్లిన భాండశకలంబులరీతి పగతుర బలంబులు వికావికలై

పలాయితంబు అగునట్లు నిజ ఖర నఖర విదారిత మత్తేభ మస్తక కేసరియుం బోలె, ప్రళయకాల తాండవకేళీ భయంకర భర్గలీలావిశేషంబున, కీకారణ్యంబులం జ్వలించు తీవ్రదావానలంబు చందంబున విజృంభించి, ఏతత్ వ్యూహ పరికల్పక, సంరక్షక ధీరాభీల పరాక్రమోద్దీప్త మదగర్విత కౌరవానీకంబు సర్వంబును యమువానసంబున కతిథుల గావింతము రమ్ము!

(కత్తిపై చేయి వేసి) ఓ ఖడ్గరాజమా? విజృంభింపుము. మరుగుపడిన మహోన్నతావకాశము మరల ముందునకు వచ్చినది. ఇపుడు నీవు సామాన్య ఖడ్గరాజమువు కావు. అరివీర భయంకర, సైన్యాధ్యక్ష అభిమన్యుకుమారు కరవాలమవు. సూర్యోదయాత్ ప్రభృతి నీ వీరవిజృంభణము సమస్తలోకము కనులార గాంచగలదు. ఏతత్ సమయ సమారంభమునకై మద్దక్షిణ హస్తము విప్పిళ్ళూరుచున్నది... ఓరీ! నికృష్టజీవనులారా! నిలుడు! ఇదే వచ్చుచున్నాడ... (అంటూ వేగంగా లోనికి వెళతాడు)

—+—






## శ్రీనాథుడు

(రచయిత : శ్రీ వసంతరావు రామకృష్ణారావుగారు. ప్రకాశకుడు : శ్రీ కె. అచ్యుత రామారావు గారు. కంచరవీథి, విశాఖపట్టణము. వెల ½ రూ.)

శక్తిమతియగు ఆంధ్రవాఙ్మయ నదీ ప్రవాహము అనువాదనిమగ్నమై యుద్వేలముగా ప్రవహించుచుండగా, దాని నడ్డి నిలిచి మహోన్నతమూర్తియై ద్వీపములను, ద్వీపకల్పములను పెక్కిటి నేర్పాటు గావించిన కవితాశ్రీనాథుడగు శ్రీనాథుని సూక్తికి వశంవదులు కానివా రెవ్వరు? శ్రీనాథుని పరిశీలనమున రెడ్డిరాజుల చరిత్రయేకాక, పాత్రచిత్రణ, ఉక్తిచాతురి, అనువాదపద్ధతులు, వర్ణనలు మున్నగువాని యందును వాని ప్రత్యేకత విలక్షణమై సాక్షాత్కరించును. శ్రీనాథునిపై వేటూరి మున్నగువా రనేక విమర్శ గ్రంథములను వ్యాసములను వెలువరించిరి. ఆధునికులలో శ్రీనాథునిగూర్చి రచించిన వారిలో శ్రీ వసంతరావు రామకృష్ణరావుగా రొకరు. వీరు శ్రీనాథుని కాలము, రెడ్డిరాజులు, నాటి కవిపోషణము, అనువాదవైఖరి, శ్రీనాథుని కావ్యదృష్టి, సారస్వతసేవ, లోకజ్ఞత, అలంకారమర్మజ్ఞత, శృంగారప్రియత్వము, పోతన - శ్రీనాథుడు, రసము, ధ్వని యను విషయములతో 69 పేజీల గ్రంథమును సాకారించిరి. స్థూలారుంధతీన్యాయమున శ్రీనాథుని దిగ్దర్శనముగ చక్కగ నిరూపించిరి. శ్రీనాథుని విషయమున వీరు గావించిన కృషి ప్రశంసనీయము. ఉపాధ్యాయ వృత్తిలో నుండకపోయినను, వీ రింత కృషిచేయుటను గమనించినచో సారస్వతపరాయణులగు నుపాధ్యాయులు చేయవలసిన దెంతయో యున్నదనిపించును.

వీరు శ్రీనాథుని రచన లన్నిటిని వరుసగా పేర్కొని వానిపై స్థూలముగనైన కొంత వివరణ నిచ్చినచో మరింత బాగుండెడి దనిపించును. శ్రీనాథుని వ్యక్తిత్వముపైగల వాదోపవాదములను సూచించినచో బాగుండెడిది. ఛాయారూపమున నాతని జీవితకథను గూడ నడపిన మరింత బాగుండెడిది. శ్రీనాథుని చాటువుల నెక్కువగా నుదాహరించినచో పాఠకులకు మరింత యుత్సాహముగ నుండును. 40వ పేజీలో హరవిలాసములోని దుర్వాసుని కోపమును వర్ణించు పద్యము (వికట భ్రూకుటి ఫాలభాగుడును ఇత్యాది పద్యము)తో భారతములోని భీముని కోపమును వర్ణించు పద్యమును (కనుగొని కోపవేగమున కన్నుల నిప్పులు రాల) పోల్పవచ్చు ననిరి. తిక్కన పద్యమునకు శ్రీనాథుని యీ పద్యము పోల్పదగిన దని పలికిన బాగుండెడిది. తిక్కన పద్యమును శ్రీనాథుడు చూచియుండవచ్చును కాని శ్రీనాథుని పద్యమును తిక్కన చూచియుండడు కదా! తిక్కన పద్యమునకు శ్రీనాథుని యనుసరణ యిది యని వారి యభిప్రాయము.

సంస్కృతీసాధకములై (11 వ పే) సాహితీ గురుపీఠము (13, 57, 59 పే) రతీమన్మథులు (49 వ పే) విచారింపదగియున్నవి. ఈపదముల సాధుత్వము ఆలోచింపదగినది. 60 పేజీలోని 'ఆంధ్రభారతి

( తరువాయి 18 వ పేజీలో )

# ఈపక్షంలో

## ఎఱ్ఱన జయంతి మహాసభ

'త్రయీరూపమైన మహాభారతమును ఋషితుల్యులైన త్రిపురుషులు (కవిత్రయము వారు) అనువదించి ఆంధ్రజనానీకము నకు అందజేసిరి. వేదములలో తరతమ భేదము ఎంచరాని రీతిగానే నన్నయ తిక్కన ఎఱ్ఱాప్రెగడలలో భేదవివక్ష చూపదగదు. ఎఱ్ఱనమహాకవి లేనిచో ఆంధ్రమహాభారతము అసమగ్రముగనే యుండెడిది. నన్నయ తిక్కనలతో పాటు ఎఱ్ఱనకును ఆంధ్రులు ఋణపడి యున్నారు.

అట్టి ఎఱ్ఱన జయంతి హంసపారు క్లబ్బు యాజమాన్యమున జరపబడుట ఎంతయు హర్షదాయకము, సమంజసము నై యున్నది. కవిత్రయమువారియెడల భక్తి ప్రపత్తులు చూపుటకు, వారి ఋణము తీర్చు కొనుటకు, వారి గ్రంథముల పఠన ప్రచారములు కావించుట ఆ గ్రంథము లందలి ధర్మప్రబోధములను ఆచరింప బ్రయత్నించుట, ఆవశ్యకముగాని; రమారమి ఎనిమిది శతాబ్దముల అనంతరము వారి రూపరేఖాదుల నూహించి చిత్రింప బూనుట కాదు. ఊహాకల్పనలకు సత్యము అందనిది అని గ్రహింపవలెను.

సుమారు 25 సం॥ క్రిందట శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు మొదటిసారిగా రాజమండ్రిలో కళాభివర్ధనీ పరిషత్తు తరఫున నన్నయ జయంతి జరపియున్నారు. 10 సం॥ క్రిందట హంసపారు క్లబ్బువారు నన్నయ తిక్కన శ్రీనాథుల జయంతులు జరపియున్నారు. మూడు సంవత్సరముల నుండి శిరన్మండలివారు నన్నయ జయంతి జరపుచున్నారు. పూర్వ మీ జయంతులు జరపినవారిని స్మరింపకుండుట సాహిత్య అపచారము, అనౌచిత్యము అగును. నన్నయ తిక్కన జయంతులతో పాటు ఎఱ్ఱన జయంతియు జరపడం ఆంధ్రుల విధి.' అని 3-1-1981 తేదీని రాజమండ్రి హంసపారు క్లబ్బువారి యాజమాన్యమున యంగ్ మెన్స్ వైశ్యాఅసోసియేషన్ & వుమెన్స్ అసోసియేషను హాలులో జరగిన మహాసభకు అధ్యక్షత వహిస్తూ శ్రీబులుసు సీతారామశాస్త్రి గారు ఉద్ఘాటించారు.

ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలా విద్యార్థినుల ప్రార్థనతో సభ ప్రారంభమైనది. సభాప్రారంభమున వదాన్యశేఖరులు, సాహిత్యప్రియులు అయిన శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యం దంపతులు ప్రముఖ విద్వాంసులు, మహోపన్యాసకులు అయిన శ్రీకళాప్రపూర్ణ డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారిని, శ్రీమతి డాక్టరు పి. యశోదారెడ్డి, ఎం. ఏ., పిహెచ్. డి., డి.లిట్. గారినీ నూతనవస్త్రయుగ్మముల తోడను, చందనతాంబూలాదులతోడను ఘనముగా సన్మానించిరి.

అనంతరము శ్రీ వేంకటావధానిగారు ఆరణ్యపర్వశేషమును గూర్చి మహోపన్యాసము కావించిరి. 'నన్నయ రచింపగా మిగిలిన ఆరణ్యపర్వభాగమును ఎఱ్ఱన సొంతముగా రచింపలేదు. నన్నయయే సంపూర్ణముగా రచింపగా శిథిలమైన భాగములను ఎఱ్ఱన పూరించెను' అనే అపోహలు కొన్ని కలవు. అట్లపోహ పడుటకు ఆరణ్యపర్వశేష ఆశ్వాసాంతముల 'నన్నయ ప్రణీతంబైన అని యుండుట', 'ఆదిదొడంగి మూడుకృతు లంధ్ర కవిత్వ విశారదుండు... నన్నయ రచించె' ననుట, భారతమును ఎఱ్ఱన పూరించెనన ఆరణ్యపర్వశేషంబు పూరించె ననుట, మున్నగునవి కారణములు. ఇవి అన్నియు పరిశీలనమీద నిలువనవి కావు' అని వక్కాణించి అనేక ఉపపత్తులతో ఆరణ్యపర్వశేషమును ఎఱ్ఱాప్రెగడయే రచించె నని ఋజువుచేసిరి. ఎఱ్ఱన రామాయణము మనకు లభ్యమై యున్నయెడల విశ్వనాథ రామాయణకల్పవృక్షమునకును భారత భాగవతములకు దీటైన ఆంధ్ర రామాయణము లేని లోటు ఉండెడిది కాదనిరి. రామాయణము, నృసింహ పురాణము, హరివంశము, ఆరణ్యపర్వశేషములలో ఏవి ముందు ఏవి వెనుక అను విషయ మింకను పూర్తిగా నిర్ధారణకాలేదని తెలుపుతూ నన్నయ తిక్కనల మార్గము ననుసరించియే ఆరణ్యపర్వశేషమును ఎఱ్ఱన రచించె నని సోదాహరణముగా వివరించి ఎఱ్ఱన మహాకవీంద్రునకు నమోవాకము అర్పించిరి.

అష్టావధాని శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావు, ఎం.ఏ. గారు మూడుపద్యములతో ఎఱ్ఱన కవీంద్రుని స్తుతించిరి. ఒక పద్యముతో తమ గురువుగారైన శ్రీ వేంకటావధానిగారిని ప్రశంసించిరి.

శ్రీమతియశోదారెడ్డిగారు ప్రసంగిస్తూ 'ఎఱ్ఱనమహాకవి నన్నయతిక్కనల కవితా రీతితో ఆరణ్యపర్వశేషమును అనువదించి నాడు. హరివంశము అనువాద మంటారు

---

(17 వ పేజీ తరువాయి)

కలడు తన కమనీయ కావ్యహారములను సమర్పించి తన కీర్తి కాముకతను చాటు కొనెను.' అను వాక్యము శ్రీనాథుని కీర్తి కాముకతను స్పష్టపరచుచున్నది. శ్రీనాథుడందిన కావ్య ప్రయోజనములలో కీర్తి యొకటి కావచ్చును కాని కీర్తి కాముకతయే ప్రధానమనుట శ్రీనాథుని రమణీయ కవితా వ్యక్తిత్వమును కళంకితము చేయుచున్నది.

ఇట్టి నెరసు లచటచట నొకటి రెండున్నను వీరు కావించిన కృషి ప్రశంసనీయ మనుట నిస్సందేహము.

— శ్రీ ప్రసన్న.

—+—

కాని అదేంతమాత్రమూ అనువాదము కాదు. స్వతంత్రపు పోకడలతో నవరస భరితముగా, మహాప్రబంధముగా హరివంశము రచింపబడినది. అనేక వంశముల వర్ణన లిందు గావింపబడినవి. శ్రీకృష్ణావతారమునకు సంబంధించిన వంశముల ఔన్నత్య మీమాంసలందు వివరింపబడినది. నీలాసుందరీ పరిణయము, రుక్మిణీ కల్యాణము మున్నగు ఘట్టము లెంతో మనోహరములు, అని వక్కాణిస్తూ ఎన్నో ఉదాహరణములతో హరివంశ ప్రాశస్త్యము నుగ్గడించిరి.

ఆరంభమున హుషారు క్లబ్బు ప్రధాన కార్యదర్శి డా. మాచిరాజు రామకృష్ణారావుగారు ఎఱ్ఱనజయంతి ఉత్సవసందర్భమును వివరించి వక్తలను పరిచయము చేసిరి.

శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యముగారు శ్రీ బులుసు సీతారామశాస్త్రిగారి సాహిత్య సేవను కొనియాడిరి.

హుషారు క్లబ్బు సహాయ కార్యదర్శి శ్రీ సి. నరసింహాచారి, ఎం.ఏ, ఎం.ఇడి., బి.ఎల్. గారు వందనసమర్పణ గావించిరి.

---...---

## గీతా జయంతి.

'భగవద్గీత హిందువులందరికే కాకుండా ప్రపంచానికంతటికి ప్రబోధ గ్రంథముగా వెలుగొందుతూ వస్తూన్నది. ఈ భగవద్గీత పారాయణ గ్రంథముగా మాత్రమే కాకుండా నిత్యజీవితములో ఆచరించుట ద్వారా గౌరవించదగిన గ్రంథము. అప్పుడే గీతలోని అనేక సత్యాలు మనకు తెలుస్తాయి.' అంటూ ఇటీవల హిందూసమాజంలో గీతాజయంతి సందర్భంగా ఏర్పాటు చేయబడిన బహుమతి ప్రదానసభలో శ్రీ వై. వి. ఆర్. నరహరిరావు, జిల్లా అడిషనలు సెషన్స్ జడ్జి ఉద్ఘాటించారు.

సభా కార్యక్రమమును ప్రారంభిస్తూ అష్టావధాని శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వరరావు మాట్లాడుతూ 'ప్రపంచమంతా భగవంతునిచే సృష్టించబడినదనియూ, జగత్తు భగవత్స్వరూపమే యని తెలుసుకోవాలనియు' అన్నారు. ముఖ్యంగా యువతరం తగిన శ్రద్ధ చూపి భగవద్గీతలోని సూత్రాలను, అర్థాన్ని క్షుణ్ణంగా తెలిసికోవటానికి ప్రయత్నించాలి. అప్పుడే యువకులలో క్రమశిక్షణ, ఉత్సాహం లభిస్తాయి.

శ్రీమతి తాడిమళ్ళ దుర్గావతి ప్రసంగిస్తూ 'మానవాళి అభ్యున్నతికై భగవంతుడు యిచ్చిన వరమే భగవద్గీత. మానవుని దేవతగా చేయడానికి అవసరమైన ఆచరణరీతు లన్నింటిని భగవద్గీత సమగ్రంగా తెలుపుతుంది. అందుచేతనే ఇది ప్రస్థానత్రయంలో ఒక గ్రంథంగా గుర్తింపబడింది. 'ఆయా వ్యక్తులు వారి వారి సంస్కారములను, మానసిక ప్రవృత్తులను అనుసరించి భగవద్గీతవల్ల ఫలితాన్ని పొందుతూ వుంటారు' అంటూ గీతా ప్రాశస్త్యాన్ని గురించి ప్రబోధించారు.

మాజీ ప్రిన్సిపాలు శ్రీ రెబ్బాప్రగడ సూర్యనారాయణమూర్తి మాట్లాడుతూ 'అందరికీ గీత ఆరాధ్య మనియు, మన పూర్వీకులు ఈ గ్రంథంవల్లనే స్ఫూర్తి పొందారనియు అన్నారు.

శ్రీ కనకదండి సూర్యప్రకాశశాస్త్రి వేదపఠనంతోనూ, శ్రీ ఎస్. వెంకటేశ్వరరావు, జూనియర్ యింజనీర్, గీతాప్రార్థనతోను సభ ప్రారంభమైనది.

పోటీలను సమీక్షిస్తూ కార్యవర్గ సభ్యులు డా. సి. కృష్ణమాచార్యులు, '80 సం॥ల క్రితం శ్రీ న్యా
రావు పంతులుగారి సంకల్ప
వారి త్యాగపటిమచేతను,
నిచ్చిన శ్రీవివేకానందుని ఆ
చేతను ఇంతకాలంగా గీత
జరుపుతూంటూ వస్తూవున్నా
గీతాప్రబోధం ద్వారా వా
హిందూధర్మ ప్రచారము
బాలురలో, యువకులలో
స్తారాన్ని అభివృద్ధిపరచుట
సమాజం ధ్యేయమనియు'
గీతా పోటీలలో సుమారు
బాలబాలికలు పాల్గొని,
విశ్వాసములు చూపారని
అతిథులను పరిచయం చే
కార్యదర్శి శ్రీ సత్యవోలు
మూర్తి స్వాగతం పలికారు

పరీక్షలలో ఉత్తీర్ణులైన
రికీ శ్రీబోనుమద్ది రామలింగ
నిధిగా శ్రీ కంచుమర్తి శ్రీర
గీత ప్రతులను బహుమతిగా

—)*(—

'మినీ కవితా విప
కావ్యావిష్కర

ఇటీవల హైదరాబాదుల
దేశ్ సాహితీప్రియుల సవ
ర్యంలో, శ్రీకృష్ణ దేవరాయ
నిలయంలో 'మినీకవితా విప
వందలమంది కవుల మినీకవి
ఆవిష్కరణసభ వైభవంగా
ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి
ఈ గ్రంథాన్ని ఆవిష్కరిస్తూ
లోకంలో తొలి గ్రంథం
తున్న సమగ్ర మినీకవితాసం
సుమారు రెండువందలమంది
వెలువడుతున్న ఈ గ్రంథ

లోకంలో నాలుగు కాలాలపాటు నిలిచి నిలుస్తుంది అన్నారు.

ఈ కార్యక్రమానికి ఆంధ్రప్రదేశ్ సాహితీప్రియుల సమాఖ్య అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ డెయిరీ డెవలప్ మెంటు కార్పొరేషన్ మాజీ ఛైర్మన్ గౌరవనీయులు శ్రీ త్రిపురాన రాఘవదాసు గారు అధ్యక్షత వహిస్తూ ఈ గ్రంథాన్ని ప్రశంసించారు. తరువాత గ్రంథ సంకలన కర్త శ్రీ కొల్లూరి కావ్యనిర్మాణ దశలను నేడు మినీకవిత తమతరాన్ని వివరిస్తూ సాహిత్యలోకానికి నా చేతులమీదుగా అందిస్తున్న తొలిగ్రంథం ఇది అని అన్నారు.

తర్వాత ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక ఉపసంపాదకులు శ్రీ ఎల్లోరాగారు ప్రసంగిస్తూ మినీకవితలు సామాజిక స్పృహానిలయాలు. ఇవి కొరడా దెబ్బలు. ముక్కుసూటిగా, నిదానంగా గుండెల్లోకి దూసుకుపోయే ప్రత్యేక సాధనం యిది అన్నారు. శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారు ప్రసంగిస్తూ కొన్ని మినీకవితల్ని ఉదాహరిస్తూ ఇవి 'వచనకవితా యావనరూపాలు' అన్నారు. ఈ మినీకవితా ఉద్యమం మరింతగా సాగాలనీ, దీనికి ప్రతినిధులుగా యువకు లంతా కృషిచేసి నిలబడాలని కోరారు. చివరగా డా. వాసా ప్రభావతి గారు ప్రసంగిస్తూ మినీకవితలు నేడు సాహిత్యంలో ఎంతైనా అవసరం. వాటిప్రయోజనం అనంతం అంటూ పుస్తకాన్ని ప్రశంసించారు. చివర శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు అనేకమంది సాహితీప్రియులు పంపిన సందేశాలను సభకు వినిపించి వందన సమర్పణ చేసారు.

—+—

# శ్రీనాథుడు - శివాద్వైతము

– శ్రీ అ. నరసింహశర్మ.

తెనుగులో శైవకవులకు ప్రత్యేక స్థానం ఉంది. అంతా శైవులే అయినా శ్రీనాథుని శైవానికి సోమనాథాదుల శైవానికి సిద్ధాంత వ్యత్యాసం చాలా ఉంది. రెండూ భిన్నసంప్రదాయాలు. ఈ రెండుశాఖలలోనూ శివుడు ఆరాధనా మూలస్తంభంగా ఉంటాడు ఆరాధనా క్రమంలోనూ, శివరూపకల్పనలోనూ, లింగారాధనలోనూ, మంత్ర జపాదులలోనూ, అవతార కథనంలోనూ, రెండింటికీ వ్యత్యాసం ఉండదు. శివునిమహత్వ నిరూపణంలోనూ, జగదేక దేవునిగా భావించుటలోనూ, భేదం ఉండదు.

భేదనిరూపణము :

1. సోమనాథాదుల మతంలో శివుడు మిగిలిన దేవతలకు నారాయణాదులకూ శాసకుడు. సర్వజగన్నియంత శివుడు. ఇతరదైవారాధన నింద్యము. పాపము. అల్పఫలప్రదము.

2. వర్ణాశ్రమాదులకన్న శివభక్తి ప్రధానము. శివభక్తుడుకాని విప్రుడు కూడ నింద్యుడు. శివభక్తుడైన పాటచ్చరుడునూ పూజ్యుడు.

3. అనన్యభక్తి ఒక్కటే శివ ప్రసాద హేతువు. సర్వార్పణము భక్తికి నిదర్శనము అది ఒక్కటే తారకము.

4. శివునకు పిపీలికాది బ్రహ్మపర్యంతమైన ప్రాణులకు గల సంబధము ప్రభు దాస రూపము.

5. 'తత్వమసి' మొదలగు మహా వాక్యలకు ద్వైతార్థము వీరి భావన. తస్య త్వం అసి ఈశ్వర సేవకసంధము కలవాడవునీవు. శివునికి వాడవు. ఆతడు ప్రభువు. అని సంవిజ్ఞాన తత్పురుష వీని వ్యాఖ్యానము

6. శివభక్తులు శివునికంటే అంగ్యులు; అనే ప్రపత్తి వీరి భావనలో ఉంది. ఇవి ముఖ్య భేదాలు.

శివాద్వైతులకు సోమనాథాది పాశుపతులకు ఈ భేదం ఉంది. శ్రీనాథుడు శివాద్వైతుడు. ఈవిషయం నిరూపించేముందు దేశకాల స్వరూపాలు వివరించాలి.

నాటి పరిసరాలు :

14 వ శతాబ్దంనాటి విద్యానగరం ఆంధ్రదేశము వైదికమతవ్యాప్తిచే నిబిడమైంది. సాయణాచార్యులవారు నాల్గు వేదాలకు భాష్యాలు వ్రాసేరు. పండితులు అన్నిశాస్త్రాలసారం తెలిసిన వారు సదా విద్వద్గోష్ఠులు జరిపేవారు. విద్యారణ్య స్వామివారి అద్వైతబోధ జరిగింది. ఆత్మబోధ అందరిహృదయాలలో ప్రతిధ్వనించింది. నాటి సంప్రదాయం దాని వాసనలు ఆ ప్రాంతాన్ని ప్రభావితం చేసేయి. పూర్వసామ్రాజ్యం కాకతీయులది. వారు శైవులు అయినా వారిది అద్వైతశైవము. అంచేతనే విద్యానాథుడు

'కౌసల్యాసీత్ప్రథమజననీ దేవకీ
చ ద్వితీయా
... ముమ్మడాంబా తృతీయా

అని రుద్రదేవుని తల్లిని నుతించి రుద్రుని విష్ణువుగా వర్ణించేడు. అంచేత నాటి రాజ్యము, పండితులు అంతా శివాద్వైత బుద్ధికలవారు.

అయినా శివభక్తి వారికి సహజము. అక్కడ శివనుతి శ్రీనాథునికి పెన్నిధ్యాన్నిచ్చింది.

శివాద్వైత నిరూపణము :

శ్రీనాథుని శివాద్వైతము నిరూపించుటకు ఈపద్య వ్యాఖ్యానము చాలును.

సింగనామాత్యుడు కృతికర్తను నుతిస్తూ నిండుసభలో అన్నపద్య మిది. ఇందలిప్రతి పదమూ అన్యూనాతిరిక్తాక్షర సమన్వితము.

బ్రాహ్మీ దత్త వరప్రసాదుఁడ వుర
 ప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుడ వీశ్వరార్చన కళా
 శీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణచయ తా
 త్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధానమవు నీ
 భాగ్యంబు సామాన్యమే ?

ఇందులో ఈశ్వరార్చన కళాశీలుడవు 'అభ్యర్హిత బ్రహ్మాండాది మహాపురాణ చయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధానమవు' ఈరెండు విశేషణాలు పరిశీలిస్తే ప్రకృతవిషయం శ్రీనాథుడు శివాద్వైతిఅనేది నిర్ధారిత మవుతుంది.

### మొదటి విశేషణసారము (శంక)

ఇందులో ఈశ్వరార్చన కళగావర్ణింపబడింది. కళలు 64. ఇవి ఐహిక ప్రయోజనము కలవి. రమ్యమైనవి. విద్య పరలోక ప్రయోజనముకూడా కలది. ప్రశాంత రమణీయమైనది. ఆవిద్య మళ్ళీ రెండు విధాలు. పరా, అపరా అని. కర్మలు ఈశ్వరారాధన అపరావిద్యలు. అన్నింటి కన్నా మిన్నయైనది పరావిద్య. అది మోక్షప్రదము. ఇది ప్రాచీన విభాగము. కాగా ఈశ్వరారాధన కళ అనుట కవి సమయాతిక్రమణ మవుతుంది అన్నది శంక.

### సమాధానము :

కళ అనేపదము మొదట ప్రశ్నోపనిషత్తులో వాడబడింది. ఇందులో ఆరు ప్రశ్నలు సమాధానాలు ఉన్నాయి. పిప్పలాదుడనే ఆచార్యుడు శిష్యులకు ఇచ్చిన సమాధానాలు వివరింపబడ్డాయి.

6 వ పృచ్ఛకుడు 'సుకేశీభారద్వాజః' అనువాడు. 'పదునారు కళలు కలపురుషుడెవరు? ఎక్కడ ఉన్నాడు' అన్నది ప్రశ్న.

ఇది ఉపనిషత్తు కాబట్టి బ్రహ్మవిద్యా బోధకము.

శరీర హృదయపుండరీకమందు (చిదాకాశమునందు) ప్రాణాదులైన షోడశ కళలతో పురుషుడు ఆవిర్భవిస్తాడు. వాడు సద్భిన్నుడు. పెరిగి సత్తునందే లయ మవుతాడు. సద్రూపశివుడు నిష్కలుడు. కాని ఈకళాపూర్ణుని రూపంలో జగద్వ్యాపారాన్ని నడిపిస్తున్నట్లు ఉంటాడు. ఈకళలద్వారా నిష్కలుడగు ఈశ్వర స్వరూపావగతి ఉపాసన. కాబట్టి ఇది సాలంబన బ్రహ్మవిద్య. ఈ కళనే 'ఈశావాస్య మిదం సర్వం' అని ఈశ్వర వ్యాప్తిని సంహితోపనిషత్తు చెపుతూంది. నాదబిందుకళాత్మకమైన ఈతచ్ఛక్తే ఓంకార రూపము. అది శివవాచకము. ఉపాసకులకు ఆలంబనము.

ఈ ఓంకారాన్ని నాల్గుపాదాలుగా మాండూక్యం చెపుతోంది. అది ఉపాసనా సౌలభ్యం కొరకు విభాగము అని గ్రహించాలి.

ఈ ఉపాసనారహస్యాల నన్నింటినీ గురువుద్వారానే గ్రహించాలి. సంప్రదాయ రహితుని గూర్చి భగవత్పాదుల వారు ఒకమాట అన్నారు 'సర్వశాస్త్ర విదపి సంప్రదాయ రహితః మూర్ఖ ఇవోపేక్ష్యః' అని అన్నారు.

ఈకళ అనేపదము కేవలము శాస్త్ర మాత్ర ప్రసిద్ధమై కావ్యవిదూరమై దోష భాజనము కాలేదు.

'సర్వము న్నతనిదివ్య కళామయ మంచు విష్ణునం దుల్లము చేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ' అని పోతన ప్రయోగము. శ్రీకైవల్య పదంబు గోరి అనేపద్యంలో ఈశ్వరకళ జగద్వ్యాపారదక్షము అని విదితమవుతుంది. ఈశ్వరార్చన యందు కళద్వారా చింతనము చేయువాడని భావము. కాగాకార్యము ద్వారా కారణగ్రహణము చింతనము. అదే ఉపాసన. కార్యేణలింగేణ కారణ మన్విచ్ఛఅని అష్టాధ్యాయి చెపుతుంది.

శీలము అనేపదానికి చింతనము అనే అర్థము కవి ప్రయోగాలలో ఉంది.

'శీల ను శీలయ మానస్యసి ముక్తిం'

శ్రీనాథుడు ఈశ్వరకళ అంటే పోతన వైష్ణవ కళ అన్నాడు. ఇద్దరూ అద్వైతులే పరమాత్మకు చాలావిభూతులున్నాయి. విభూతిద్వారా పరమాత్మను అవగతము చేసికొనుట ఉపాసన. అంచేతనే అర్జునుని

'కేషు కేషు చ భావేషు చిన్త్యోసి భగవన్మయా' అను ప్రశ్నకు విభూతులు వివరింపబడ్డాయి.

'రుద్రాణాం శంకర శ్చాస్మి'

'వృష్ణీనాం వాసుదేవోస్మి'

ఈ రెండూ విభూతులే ఆత్మశాఖలే. ఒక విభూతి ద్వారా ఆత్మ నారాధించేవాడు మిగిలిన ఏ విభూతినీ ద్వేషించడు. అన్నీ దాని స్వరూపాలే. అని ఆత్మీయతనే ప్రదర్శిస్తాడు. భేదభావము లేకపోవుట అద్వైతములోని ప్రత్యేకత. ఏకం సత్ విప్రా బహుధా వదంతి అనేభావం ఉంటుంది అంచేతనే శ్రీనాథుడువిష్ణువర్ణనను పోతన శివస్తుతిని అనన్యంగానే చేస్తారు. ప్రకరణాన్ని బట్టి దైవాన్నిమిన్నగా చెప్పుట కవిసమయము. భక్తిప్రభావము. ఆత్మకన్న అభిన్నంగాను విభూతిగాను వర్ణించుట భావించుట ఆత్మోపాసనమే అవుతుంది. దైవాన్ని భిన్నంగాను ద్వైత భావంతో ఉపాసనచేసినప్పుడు న్యూనాధికత లనే కలహం వస్తుంది. అద్వైతంలో ఆ భావమేలేదు. అంచేత శ్రీనాథుని శివుడు అద్వైతభావనచే నుతింపబడే వాడు అవుతున్నాడు.

ఆత్మభావన లేకుండా చేసేఉపాసన బ్రహ్మవిద్యకాదు

అంచేతనే బ్రహ్మదృష్టి రుత్కర్షాత్ అని బాదరాయణాచార్యుడు వివరించేడు. అట్టి బ్రహ్మము నందుటకు ఈశ్వర కళ ఆలంబనముగా అర్చించుట విద్య. అట్టి విద్యాబలము కలవాడు శ్రీనాథుడు.

(సశేషం)

# లేఖ

## పత్రికలు – అనౌచిత్యాలు

ఆర్యా!

హుషారు క్లబ్బు యాజమాన్యమున శ్రీ బులుసు సీతారామశాస్త్రిగారి అధ్యక్షతను 3-1-81 తేదీన ఎర్రన జయంతి జరుగునని; శ్రీ కళాప్రపూర్ణ డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు భారత అరణ్యపర్వ విశేషమును గూర్చి, శ్రీమతి యశోదారెడ్డిగారు హరివంశమును గురించి ఉపన్యసిస్తారని; సమాచారము, ఆంధ్రప్రభ, ఈనాడు దినపత్రికలలో ఎంగేజిమెంట్సులో ప్రచురితమయియున్నది.

సభ జరిగి ఒక వారం రోజులు దాటినా ఇంతవరకు పై పత్రికలలో సభావిశేషముల వృత్తాంతము ప్రచురింపబడలేదు.

ఈ వారంనుండి సదరు పత్రికలలో ప్రచురింపబడే సభా వృత్తాంతాల మాత్రం ప్రాముఖ్యం ఎర్రన జయంతికి కాని, శ్రీ అవధానిగారి అరణ్యపర్వ విశేష ఉపన్యాసానికి గాని, శ్రీమతి యశోదారెడ్డిగారి హరివంశ ఉపన్యాసానికి గాని లేదా? సదరు పత్రికల విలేఖరులకు లేదా పత్రికాధిపతులకు హుషారు క్లబ్బువారి మీద కాని, వారి కార్యనిర్వహణ విధానాలమీద గాని అక్రమ వైరుధ్యం ఏమైనా ఉన్నదా? లేదా సదరు పత్రికల లేకరులు సమాచార సేకరణ చేయకుండా నిద్రపోతున్నారా?

11-1-81 న మాత్రం ఆంధ్రప్రభలో శ్రీమతి యశోదారెడ్డి హరివంశం అనువాదము కాదని, స్వతంత్రపు పోకడలతో రచింపబడిన ప్రబంధమని అన్నారని వార్త ప్రచురించారు. శ్రీ అవధానిగారి మహోపన్యాస విషయాన్ని ఆ పత్రిక వారు ఎందుకు జారవిడిచారో తెలియకున్నది. ఈరీతిగా అవకతవకగా వ్యవహరిస్తే పత్రికలమీద గౌరవం పెరుగు

# హిందూ రిపబ్లిక్కు!

– శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ.

* ఇదె యేతెంచెను దివ్యదీధితులతో
'హిందూరిపబ్లిక్కు' అ
ద్వదిక్కోటుల్ భరత ప్రజావళికి శ
శ్వత్ సౌఖ్య సంపత్ప్రభా
భ్యుదయాపాదక లోక బాంధవ కళా
స్ఫూర్త్యన్వితంబై, శుభ
ప్రదమై, దిగ్విజయేందిరాన్విత యశః
ప్రారంభ సంరంభమై॥

* జండావందన మాచరించుట, ప్రతి
జ్ఞారూప సద్భావనా
గాండీవమ్మును చేకొనుటయు, లో
కంబందహింసారుచుల్
నిండారంగను శాంతిసౌఖ్యములు సు
స్నేహానువర్తించి యొ
క్కండై యొప్పగ సేవసేయుటయు నీ
కర్తవ్యమో సోదరా!'

* మంచిని పెంచి మానవ స
మాజమునందున గాఢరీతి వ్యా
పించిన చీకటిన్ దెగడి
వేయక చక్కని కాంతిరేఖలన్
బంగెడు చిన్నిదివ్వెను ప్ర
పంచమునన్ వెలిగించి నీవిధిన్
మించిన పూనికన్ సలుపు
మీ! ఇదియుక్తముగాదె! సోదరా!॥

—+—

తుందా? సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలను విషయంలో పత్రికల దృష్టిని గూర్చి విశాఖపట్నంలో శ్రీదాశరథిప్రసంగం పత్రికలవారు గమనించదగినది.

వి. సూర్యనారాయణ, బి.కాం.,
6-8 7, ఇన్నీసుపేట,
రాజమండ్రి.
12-1-1981.

—+—

# సంక్రాంతి

– శ్రీ పి.వి.ఎల్. సుబ్బా

* సంక్రాంతి మనకి క్రొత్తదా?
మనము సంక్రాంతికి క్రొత్తవారమా
ఏటేటా అది వస్తోంది?
క్రొత్తదనానికి యత్నిస్తోంది
మనమే ఒకసారి పైక్రోస్కో
మరొక్కసారి టెక్స్కొపు తృతీయ

* కాటుక నిండిన కళ్ళలో సిద్ధ
కాంతి ఉన్నా శాంతి కానరా
పారాణి పాదాలలో ఎఱ్ఱని ఆరని జిష్టడు
శక్తి ఉన్నా పరుగెత్తే ఆసక్తి లే
పూలజడమీద మోజైతే ఉంది
గాని మోసే శక్తి మటుకు లేదు
క్రొత్తబట్టల్లో క్రొత్తగా ఉన్న మనుషు కేసిన
మనస్సు అద్దంలో వికృతంగా ఉన్నా

* 1 ప్రాణం లేని పదార్థానికి
జీవంపోసి దిద్దే చేతులు
ప్రాణం ఉన్న మనుష్య గణాల్ని
తీర్చి దిద్దలేకపోతున్నాయి
2 అసహ్యమనిపించే పదార్థాన్ని
ఆదరించి పూజిస్తున్నారు
ఆదరించవలసిన వారిని
అసహ్యంగా దూరం చేస్తున్నారు.

* పొలాల్లో కలాల్లో
అధిక దిగుబడులు సాధిస్తున్న మానవులు
మానసక్షేత్రంలో
మానవత్వం మచ్చుకైనా పండించడం
లేదు.

* చలివేస్తున్నా ఉదయించే సూర్యుడు
నిన్ను మత్తు వదలి ముందుకు పో
అంటున్నాడు
మంచు కురుస్తున్నా విచ్చుకున్న
పూలగుత్తులు
నిన్ను నీ కన్నీటిని దాచి
పన్నీటిని వెదచల్లుమంటున్నాయి.

(1 ముగ్గు, 2 పేడ)

—+—

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు ముగా నున్నది. వెల రు. 20 లు ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రి. పోష్టులో పంపగలము.

రెండవ సంపుటము వాల్యూములును కొలదిగా ఉన్నవి. వెల రు. 20 లు ఎం. ఒ. చే వారికి పైవిధముగనే పంపబడును. వి. పి. పద్ధతి లేదు.

మొదటి సంపుటము ప్రతులు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,

6-8-7, ఇన్నిసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.